














# Heroes start early.

Ride, race, take a tumble or even take a fall.
Because it's never too early to be a hero.



Discover
Andhra Pradesh
THE KOHINOOR OF INDIA

# బొర్రా-కొండ గుహలలో రమణీయ దృశ్యాలు!

మనదేశంలోనే చాలా పొడవైన సముద్రతీర రేఖ గల ఆంధ్రప్రదేశ్-అందమైన అడవులూ, కొండలూ, కోనలూ, లోయలూ, మైదానాలూ, నదులతో అద్భుత ప్రకృతి సౌందర్యంతో అలరారే అందమైన రాష్ట్రం!

మనదేశంలో సమతల మైదానప్రదేశంలో ఏర్పడిన అతిపెద్ద గుహల సముదాయంగా కర్నూలు జిల్లాలోని బెలుం గుహలు పేరుగాంచాయి. బొర్రా గుహలు కూడా వాటిలాగే చాలా ప్రాచీనమైనవి. అయితే ఇవి కొండ గుహలు.

తూర్పుకనుమలలో విజయనగరం జిల్లా పరిధిలో వున్న గ్రామం బొర్రా. విశాఖపట్నం నుంచి, అరకు లోయకు వెళ్ళే రోడ్డుమార్గానికి ఆరు కి.మీ. దూరంలో ఉన్నదీ గ్రామం.

సున్నపురాయితో ఏర్పడిన ఈ గుహలు దాదాపు 150 అడుగుల లోతు వరకు వెళతాయి. ఈ గుహలలోనే పుట్టే గోస్తనీ నది కొండల గుండా ప్రవహిస్తూ మైదానప్రదేశాన్ని చేరి భీమునిపట్నం వద్ద సముద్రంలో కలుస్తున్నది. గుహలలో ఒక శివలింగం ఉంది. ఆ లింగం పైభాగంలో ఒక గోవురూపం కనిపిస్తుంది. గోవు పొదుగునుంచి పుట్టడంవల్ల ఈ నదికి గోస్తనీ నది అనే పేరు వచ్చిందని చెబుతారు.

పర్యాటకులు లోపలికి వెళ్ళి 'స్టైలాక్ట్ టైట్స్' అనే అద్భుత స్ఫటిక లింగాలనూ, 'స్టాలగ్మైట్స్' అనే సున్నపురాయి ఆకృతులనూ చూడడానికి వీలుగా ఆంధ్రప్రదేశ్ పర్యాటకాభివృద్ధి శాఖ గుహల లోపల విద్యుత్ దీపాలంకరణ ఏర్పాటుచేసి ఉంది. నీళ్ళలోని బొగ్గుపులుసు వాయువు తగలడం కారణంగా సున్నపురాయి ఏళ్ళ తరబడి కరిగి బొట్లుబొట్లుగా పడడంవల్ల ఏర్పడిన స్ఫటికలింగాకార రూపాలను 'స్టైలాక్ట్ టైట్స్' అని అంటారు. బొర్రా గుహలలోని సున్నపురాయి లక్షలాది సంవత్సరాలనాటిది. వేలాది సంవత్సరాలకు పూర్వమే ఈ గుహలలో మనుషులు నివసించినట్టు చెబుతారు.

అరకు లోయకు వచ్చే పర్యాటకులు టైడా జంగిల్ క్యాంప్‌లో బసచేసి, లక్షలాది సంవత్సరాలనాటి రహస్యాలను స్వయంగా తెలుసుకుని ఆనందించడానికి బొర్రా గుహలను తప్పక సందర్శిస్తారు.

ఇక్కడికి చేరుకోవడం ఎలా? విశాఖపట్నం నుంచి 90 కి.మీ.; అరకులోయ నుంచి 14 కి.మీ. దూరంలో ఉంది. విశాఖపట్నం నుంచి రోడ్డు మార్గం గుండా కానీ, రైలుమార్గం గుండా కానీ బొర్రా గుహలను చేరుకోవచ్చు. విశాఖపట్నం– అరకులోయల మధ్య రెండువైపులా అందమైన ప్రకృతి దృశ్యాల గుండా వెళ్ళే రైలు మార్గంలో బొర్రా గుహల స్టేషన్ ఉంది.

బొర్రా గుహలను తప్పక సందర్శించండి!



**Tourism & Culture Department,**
Government of Andhra Pradesh,
3rd Floor, 'A' Block, Secretariat,
Hyderabad - 500 022, AP. India.
Ph:+91-40-3456717, 3450079,
3450991, 3450170;
Fax:+91-40-3454966,3450068.

**Central Reservation Offices of APTDC at:Visakhapatnam:** LIC Building,Daba Garden, Ph:0891-746446,Fax:713135; **Hyderabad:** Opp. BRKR Bhavan, Tank Bund Road,Ph: 040-3453036, 3450165 Fax: 040-3453086; **Secunderabad:** Yatrinivas Complex, S.P. Road, Ph: 040-7893100, 7816375; **Tirupati:** T.P. Area, Beside Venkateswara Bus Station, Ph: 08574-55385, Telefax: 08574-52062; Mobile: 98480-07033 **Tirumala:** 08574-70055, 70589; **Nellore:** H.NO. 24-1/1613, 1st floor, Opp. Kasturba Kalakshetram, Police Office Road, Dargha Mitta. Ph: 0861-306089; **Vijayawada:** Hotel Ilapuram Complex, Gandhi Nagar, Ph: 0866-570255, Information & Reservation Counter at APSRTC, Ph:0866-523966; **APTDC Divisional Offices at : Kurnool:** C/o 6, C-Camp, Nandyal Road, Telefax: 08518-70104; **Nagarjunasagar:** 08680-77364, 76540; **Srisailam:** 08524-88311; **Warangal:** 08712-459201, 446606; **Chennai:** +91(44) 5381213; **Bangalore:** +91(80) 2383361, 2383362; Fax:+91(80) 2383363




Email: aptourism@hotmail.com / aptourism@rediffmail.com / info@aptourism.com.
Visit us at: **www.aptourism.com** or **www.indiaoverland.com** For Round the Clock Tourist Information on A.P.
Dial: **1901-334033 from Hyderabad / Secunderabad & 0901-334033 from other places** in India.

ఈ నెల విశేషాలు

సంపుటి 106 నవంబర్ 2002 సంచిక 5



తప్పు ప్రజలది (బే.క) 19



శశి సాహసాలు 38



మాయాసరోవరం 11



జమీందారు చెరువు 55



## ఈ సంచికలో ...

★నాగార్జున కొండ ..10 ★మాయాసరోవరం-10 ..11 ★తప్పు ప్రజలది(బే.క) ..19 ★ ఐరావతం కథ!.. 24 ★రాజకీయం..27 ★చిలుకపలుకు! .. 30 ★చెడు సహవాసం ..32 ★తృటిలో తప్పిన అపాయం..34 ★మోసపోయిన మోసగాడు..36 ★శశి సాహసాలు..38 ★అంతరిక్షంలో అపూర్వ అనుభవం..40 ★వార్తలలో బాలలు..43 ★మనదేశం గురించి తెలుసుకుందాం -క్విజ్ ..44 ★విఘ్నేశ్వరుడు-11..45 ★ కళ్ళు తెరుచుకున్నాయి..51 ★జమీందారు చెరువు ..54 ★ధర్మబుద్ధి...58 ★అజేయుడు గరుడుడు-21..60 ★వినోదసమయం..64 ★ఫోటో వ్యాఖ్యలపోటీ..66

SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of***
***Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. **120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్'
పేరిట పంపండి.

ఈ పత్రికలో ప్రకటనల
కోసం సంప్రదించండి:

చెన్నయ్
ఫోన్ : 044-234 7384,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :**98203-02880**
ఫోన్ : 022-266 1599/266
1946/265 3057



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# ఏకైక మార్గం!

అది ఒక ప్రార్థనామందిరం. ప్రార్థనానంతరం పూజారి పవిత్రగ్రంథం నుంచి ఒక భాగాన్ని చదువుతూన్నప్పుడు అందరూ నిశ్శబ్దంగా వినాలన్నది నియమం. ఒకరోజు పూజారి అలా చదవడం ప్రారంభించినప్పుడు, ఆ ప్రార్థనా సమావేశంలోని ఒక వ్యక్తి, పక్కనున్న పెద్దమనిషితో, "పూజారి అధ్యాయాన్ని మార్చి చదువుతున్నాడని నా అనుమానం," అన్నాడు మెల్లగా.

"ప్రార్థనా సమయంలో మాట్లాడకూడదని మీకు తెలియదా?" అని మందలించాడు ఆ ఇద్దరికీ వెనుక వరుసలో కూర్చున్న ఇంకొక పెద్దమనిషి. ఆ తరవాత మరొక వ్యక్తి, వేరొక పెద్దమనిషి ఒకరిపై ఇంకొకరు విమర్శలు గుప్పించారు వినిపించీ వినిపించకుండా. పూజారి వాళ్ళకేసి తీక్షణంగా చూశాడు. "నేను మౌనంగానే ఉన్నాను," అన్నాడు ఐదో భక్తుడు.

ప్రస్తుత ప్రపంచం తీరుకు, ముఖ్యంగా ఈనాడు మనదేశం పోకడకు ఈ సంఘటన ఒక ఉదాహరణ. "తప్పంతా ఎదుటివాళ్ళదే. నాదేం కాదు," అనే మనస్తత్వం మనది. మనలో ఇలాంటి మనస్తత్వం పాతుకుపోవడంవల్లే —తీవ్రవాదంతోసహా రకరకాల రూపాలతో హింస మనమధ్య మనగలుగుతోంది. మనం మానసిక క్రమశిక్షణను అలవరచుకుని బాధ్యతా యుతంగా నడుచుకున్నట్టయితే—మన శత్రువులు ఇప్పుడు చేస్తున్నట్టు, మనకెలాంటి హానీ తలపెట్టలేరు!

ప్రస్తుత అస్తవ్యస్త పరిస్థితులను చక్కదిద్దడం ఎలాగా? ప్రతి ఒక్కరం బాధ్యతనెరిగి నడుచుకోవడంతోనే అది సాధ్యం. మొదట మనం మనపట్ల నిజాయితీగా ఉన్నామా అని ఆత్మపరిశీలన చేసుకోవాలి. పెచ్చరిల్లుతూన్న అరాచకం, క్రమశిక్షణారాహిత్య సుడిగాలు లలో మనం కూడా కొట్టుకుపోకుండా జాగ్రత్తపడాలి. మన ఆత్మసాక్షి ఆధారంగా స్థిరంగా నిలబడగలగాలి. అదొక్కటే సరైన మార్గం!

చుట్టూ పరచుకున్న అమావాస్య చీకట్లను దీపావళి చిరుదివ్వెలు దూరంచేసే విధంగా, మనం మన మనసుల్లోని దురాలోచనా తిమిరాలను వివేకంతో తరిమికొట్టాలి!

---

సంపాదకుడు : విశ్వం
Visit us at : http://www.chandamama.org



హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 14

మనసంఘ సంస్కర్తలు కొందరిని గురించి ఇక్కడ ప్రస్తావించబడింది. వీరిలో మీకు ఎందరిని గురించి తెలుసో చూడండి.

అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!*

1. సతీసహగమనాన్ని నిషేధించాలని నేను 1830 లో ఇంగ్లాండులో విజ్ఞప్తి చేశాను. కలకత్తాలో మొట్టమొదటి ఇండియన్ సైన్స్ ఇన్‌స్టిట్యూట్‌ను స్థాపించాను. నేను ఎవరిని?

------------------------------------------------

2. 'ఒకే కులం, ఒకే మతం, ఒకే దేవుడు' అనే సిద్ధాంతాన్ని ప్రచారం చేశాను. కేరళ ప్రాంతంలో అందరికీ ప్రవేశం కల్పించే దేవాలయాలను నిర్మించాను. నా పేరేమిటి?

------------------------------------------------

3. నేను 1882లో పశుసంరక్షణా సంఘాన్ని స్థాపించాను. విగ్రహారాధనను, జంతు బలులను వ్యతిరేకించాను. నా పేరేమిటో తెలుసా?



------------------------------------------------

4. నిరక్షరాస్యతను రూపుమాపడానికి; పేదల, స్త్రీల అభ్యున్నతికీ కృషి చేశాను. 'భారత రాజ్యాంగ నిర్మాత'గా నన్ను వర్ణిస్తారు. నేనెవరు?

------------------------------------------------

5. కుష్ఠు రోగులకూ, ఇతర వికలాంగులకూ 'ఆనంద వన్' అనే 'గ్రామీణ వైద్యకేంద్రాన్ని' ఏర్పాటు చేశాను. 1999సం. గాంధీ శాంతి బహుమతి నాకు లభించింది. నేనెవరో మీకు తెలుసా?

------------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన సంఘ సంస్కర్త ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన సంఘ సంస్కర్త:**

..............................................................

..............................................................

పాల్గొనేవారి పేరు: ..............................................

వయసు: .............. తరగతి: ......................................

చిరునామా: ..........................................................

..............................................................

పిన్: ........................... ఫోన్: ...........................

పాల్గొనేవారి సంతకం: ..........................

తల్లి/తండ్రి సంతకం: ..........................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 డిసెంబర్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-14
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈకాట్టుతాంగల్, చెన్నయ్-600 097.



సూచనలు:
1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్లయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

## పాఠకుల లేఖలు



సీరియల్స్‌తో కలిసి కనీసం పది కథలున్న చందమామ ఒక విందు. చందమామ కథలు రాసిన వారికీ, సంపాదకులకూ కీర్తి తెచ్చేవే. చందమామ కథలపత్రిక - పిల్లలకూ, పెద్దలకూ కూడా! కొత్తశీర్షికలు బాగున్నాయి. కాని పది కథలు కూడా లేకుండా వినోదం కోసం వినియోగించడమంటేనే మాకు అభ్యంతరం.

**- జి. నరసింహం, హైదరాబాద్-60**

గత నలభై యేళ్ళుగా విడువకుండా, ఆమూలాగ్రంగా నేను చదువుతూన్న పత్రిక చందమామ. సంప్రదాయ విలువలు పాటిస్తూ, నైతిక విలువలు పెంపొందించే కథలు ప్రచురించడం ఇప్పటికీ కొనసాగిస్తున్న మిమ్మల్ని అభినందిస్తున్నాను. గతంలో గేయకథల్లాగా, ఇప్పుడు బాలగేయాలు వేస్తే బావుంటుంది. ఫోటో వ్యాఖ్యలకు వచ్చిన వాటిలో బాగున్నవి కనీసం మూడు ప్రచురిస్తే బావుంటుంది. ఒక పేజీ కథలు కనీసం మూడు ఉండేలా చూడండి.

**-మాధవీ సనారా, ఖరగ్‌పూర్-721301**

'మీరేచేసుకోవచ్చు' చాలా ఇంటరెస్టింగా ఉంది. ఈనెల రానందున పిల్లలు చాలా నిరుత్సాహపడ్డారు. గరుడుడు బొమ్మలకథ చాలా ఆసక్తికరంగా ఉంది. పరోపకారి పాపన్న టైపులో బొమ్మల కథ ఉంటేచాలా బావుంటుంది. మంచి ప్రబోధాత్మకమైన కథలు నేటి బాలలకు చాలా అవసరం.

**-పిచ్చిక మల్లేశ్వరరావు, హైదరాబాద్-72**

# నాగార్జున కొండ



చారిత్రక అవశేషాలూ, సమకాలీన విశేషాలూ పక్కపక్కనే ఉంటూ పర్యాటకులను ఆకర్షించి ఆకట్టుకోవడానికి ఒకదానితో ఒకటి పోటీపడే సుందర ప్రదేశాన్ని మీరు చూడాలనుకుంటున్నారా? అయితే, ఆంధ్రప్రదేశ్‌లోని నాగార్జున కొండకు విచ్చేయండి. ప్రాచీన బౌద్ధమతాల అవశేషాలూ, విశ్వవిద్యాలయం ఒకవైపు; ప్రపంచంలోనే చాలా ఎత్తయిన రాతికట్టడంగా ప్రసిద్ధిగాంచిన డ్యామ్ మరొకవైపు మిమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి!

పూర్వకాలంలో విజయపురిగా ప్రసిద్ధిగాంచిన నాగార్జునకొండ, ఇక్ష్వాకు వంశస్థులు ఈ ప్రాంతాన్ని పరిపాలించినప్పుడు మహోజ్వలంగా వెలుగొందింది. క్రీ.శ. నాలగవ శతాబ్దంలో ఇక్ష్వాకుల పతనంతో నాగార్జున కొండ తన ప్రాభవాన్ని కూడా కోల్పోయింది.

ఇక్ష్వాకుల కాలంలో నిర్మించబడిన ఎన్నో భవనాలు 1926వ సం.లో జరిగిన తవ్వకాలలో బయటపడ్డాయి. క్రీ.శ. 3వ శతాబ్దానికి చెందిన స్థూపాలూ, అవశేషాలూ ఇందులో ఉన్నాయి.

పిరమిడ్ ఆకారంలో నిర్మించబడిన బౌద్ధ ఆరామం ఒకటి ఈ శిథిలాలలో ఉన్నది. ఐదంతస్థుల ఈ భవనంలో మొత్తం 1500 గదులు ఉన్నాయి. వాటికి మంచినీళ్ళు, గాలీ సరఫరా అయ్యే ఏర్పాట్లు ఉన్నాయి. సుప్రసిద్ధ బౌద్ధ విశ్వవిద్యాలయం ఇందులోనే ఉండేదని చెబుతారు.

కృష్ణానదిమీద నిర్మించబడిన నాగార్జున సాగర్ డ్యామ్ కూడా ఇక్కడే ఉన్నది. మానవ నిర్మిత మహాసాగరంగా దీనిని వర్ణిస్తారు. స్వాతంత్ర్యానంతరం మనదేశంలో తొలిదశలో నిర్మించబడిన జలవిద్యుత్ కేంద్రాలలో ఇది ముఖ్యమైనది. 124 మీ. ఎత్తయిన ఈ ఆనకట్ట - ప్రపంచంలో రాతితో నిర్మించిన ఎత్తయిన డ్యామ్‌లలో ఒకటిగా పేరుగాంచింది.

## ఇక్కడికి చేరుకోవడం ఎలా?

హైదరాబాదుకు 150 కి.మీ. దూరంలో ఉంది నాగార్జునకొండ. హైదరాబాద్, విజయవాడ, గుంటూరు నగరాల నుంచి రోడ్డు సౌకర్యం ఉంది.



# మాయాసరోవరం

## 10

[సర్పనఖుడు, సర్పస్వరుడు అనే అన్నదమ్ములిద్దరు, జలాశ్వాలమీద మరుగుజ్జుల గూడేనికి వచ్చారు. సర్పనఖుడు అక్కడ కృపాణజిత్తు మెడకు తాడు బిగించాడు. నరవానరం, సర్పస్వరుడిపైన బడి, అతణ్ణి ఎత్తుకుపోయింది. ఈ సంగతి విన్న జయశీలుడూ, సిద్ధసాధకులూ గూడెంకేసి బయలుదేరి వచ్చేంతలో, సర్పనఖుడు జలాశ్వం మీద వస్తూ కనిపించాడు. - తరవాత]

సర్పనఖుడు ఒక పెద్ద చెట్టు కిందికి వచ్చి, జలాశ్వాన్ని ఆపి, ''సర్పస్వరా!'' అంటూ కేకపెట్టాడు. ఆ కేకకూ జవాబు లేదు. సర్పనఖుడు దిగాలుపడిపోయి, అంతలోనే పట్టరాని కోపంతో ఒరలోంచి కత్తి లాగి, దాన్ని పక్కనే వున్న చెట్టు బోదెలో బలంగా గుచ్చి, ''ఇదే, నా ప్రతిజ్ఞ! నా తమ్ముణ్ణి ప్రాణాలతో చూడలేకపోయానో, వాణ్ణి చంపిన నరవానరాన్నీ, దాని యజమానినీ కంఠాలు నరికిగాని, ఈ ప్రాంతాలు వదలను!'' అంటూ అరిచాడు.

పొదల వెనక దాగి వుండి ఈ మాటలు విన్న జయశీలుడు తృప్తిగా నవ్వి, సాధకుడితో, ''సాధకా, ఈ సర్పనఖుడి ప్రతిజ్ఞ విన్నావు కదా! వాడు అరణ్యవృక్షాల సాక్షిగా గొప్ప కఠోర ప్రతిజ్ఞ చేశాడు,'' అన్నాడు.

''జయశీలా, తమ్ముడు కనబడలేదన్న దిగులుతో, వాడికి మతి స్థిమితం తప్పి ఉంటుంది. సరే, వాణ్ణి ప్రాణాలతో పట్టుకోవడంఎలా?'' అని అడిగాడు సిద్ధసాధకుడు.

జయశీలుడు ఒక క్షణకాలం ఆలోచించి, ''సాధకా, నీ రూపం, మాట తీరూ



కూడా మామూలు మనుషులకు భిన్నంగా ఉంటుంది. కనుక నువ్వే వాణ్ణి ప్రాణాలతో పట్టగలవు. నువ్వు ఏదో విధంగా వాణ్ణి సమీపించి, వాడిదగ్గర నుంచి ఆ కత్తి తీసుకోవాలి. వాడి ద్వారా, ఆ మాయాసరోవరానికి పోయే దారి తెలుసుకునే పని నేను చూస్తాను,'' అన్నాడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు, సర్పనఖుడి దగ్గరకు బయలుదేరాడు. జయశీలుడు, మరుగుజ్జు సేనానితో, ''సేనానీ, ఈ వింత రూపుడి శక్తిసామర్థ్యాలేమిటో, మనకు తెలియవు. నీవు అవసరమైతే సాధకుడికి సాయపడేందుకు, ఏ చెట్టుచాటునైనా దాగి వుండగలవా?'' అని అడిగాడు.

''అయ్యో, అదెంతపని!'' అంటూ మరుగుజ్జుసేనాని, తన వాహనం కట్టివేసివున్న రేగుపొదలకేసి బయలుదేరాడు.

ఇంతలో సిద్ధసాధకుడు శూలాన్ని ఎత్తిపట్టుకుని, సర్పనఖుణ్ణి సమీపిస్తూ, ''ఎవడ్రా, నా పెంపుడు సాలవృక్షాన్ని కత్తితో పొడిచి గాయపరిచింది? అతి దీనమైనదాని మూలుగు విని నాకు నిద్రాభంగమైంది!'' అంటూ కేకపెట్టాడు.

అది వింటూనే సర్పనఖుడు చప్పున కత్తిని చెట్టు బోదెనుంచి లాగి, దాన్ని సాధకుడికేసి గురిచేసి అలాగే నిబ్బరంగా నిలబడ్డాడు.

సాధకుడు, వాడికేసి తీవ్రంగా చూస్తూ, ''ఒరే, నువ్వు చూడగా మాయాసరోవరేశ్వరుడి బంటులావున్నావు, అవునా?'' అని ప్రశ్నించాడు.

ఇంత భయంకరారణ్యంలో తనను చూస్తూనే, తన ప్రభువెవరైందీ గ్రహించిన ఇతడెవరో గొప్ప మంత్రవేత్త అయివుంటాడనుకుని సర్పనఖుడు భయపడిపోయాడు.

సిద్ధసాధకుడు తన ఎత్తు పారినందుకు లోలోపల సంతోషిస్తూ, ''ఆ సరోవరేశ్వరుడి బంటుననే గర్వంతో, అలా గుర్రం మీద ఠీవిగా కూర్చుంటావా? ముందు గుర్రం దిగు!'' అన్నాడు గద్దిస్తూ.

సర్పనఖుడు చప్పున జలాశ్వంపైనుంచి కిందికి దూకాడు.

సాధకుడు అతడి ముందుకు వచ్చి, ''ఏదీ నా పెంపుడు వృక్షాన్ని గాయ పరిచిన, ఆ కత్తి ఇటివ్వు,'' అన్నాడు.

సర్పనఖుడు, సాధకుడికేసి అనుమానంగా చూస్తూ, ''నీకు, నా యజమాని పేరు ఎలా తెలుసు? చెట్టు మూలుగు వినగలిగినంత గొప్ప మంత్రవేత్తవా?'' అన్నాడు.

సిద్ధసాధకుడు పెద్దగా నవ్వి, ''ఒరే, సర్పనఖా! నేను నీ మిత్రుడైన మకరకేతుణ్ణి

కూడా ఎరుగుదును. ఆ కత్తి నీ చేతిలో వుండడం, నీకే ప్రమాదం,'' అంటూ సర్పనఖుడి కేసి రెండడుగులు వేశాడు.

సర్పనఖుడు అన్నిటికీ తెగించినవాడిలా పళ్ళు కొరికి, ''ఇప్పుడు నువ్వెవరివైందీ నాకు గుర్తొస్తున్నది. నరవానరం యజమాని కృపాణ జిత్తు అనేవాడు, నిన్నూ, నీ మిత్రుణ్ణీ అరణ్యంలో చూశాడు. నువ్వు కాపాలికుడివి, అవునా?'' అన్నాడు కత్తి పైకెత్తి పట్టుకుని.

సిద్ధసాధకుడు శూలాన్ని నేలలో గుచ్చి, ''నువ్వనుకున్నట్టు నేను మామూలు కాపాలికుణ్ణి కాదు, సిద్ధసాధకుణ్ణి!'' అన్నాడు కోపంగా.

''ఆహా, నీ ఎత్తుగడ నాకు తెలుసు! నన్ను పట్టుకుని, ఏ క్షుద్రదేవతకో బలి ఇవ్వాలనుకుంటున్నావు,'' అంటూ కత్తి చాచి, సాధకుడి మీదికి లంఘించబోయాడు.

కాని, అదే క్షణంలో మరుగుజ్జుసేనాని వెనక నుంచి వచ్చి, తన పొట్టేలుతో సర్పనఖుణ్ణి ఢీకొట్టించాడు. సర్పనఖుడు బోర్లా ముందుకు పడిపోయాడు. కత్తి జారిదూరంగా పడింది.

సిద్ధసాధకుడు చప్పున పోయి కత్తిమీద పాదం మోపాడు. అంతలో అక్కడికి జయశీలుడు వచ్చాడు. అతడు బోర్లాపడి వున్న సర్పనఖుణ్ణి లేపి, ''ఒరే, సర్పనఖా! నీ పేరే ఒక వింత. సర్పానికి కోరలుండడం ఎరుగుదుంగాని; గోళ్ళుండడం ఎరగం!'' అంటూ సిద్ధసాధకుడి నుంచి, సర్పనఖుడి కత్తిని తీసుకుని, దాన్ని అతడికి ఇవ్వజూపుతూ, ''ఇంకా కత్తియుద్ధం చేయాలన్న ఉబలాటం నీలో ఏమైనా వున్నదా?'' అని అడిగాడు.

దానికి సర్పనఖుడు ఈసడింపుగా, ''ఇప్పుడు జరిగింది కత్తియుద్ధమా? ఛీ,





మల్లయుద్ధం కన్న కూడా అధమంగా వున్నది!'' అన్నాడు.

ఆ మాటలకు జయశీలుడు నవ్వి, సాధకుడితో, ''ఈ మహావీరుడు తాను మల్ల యోధుణ్ణనుకుంటున్నాడేమో! కాస్త చేయీ చేయీ కలిపి చూడు,'' అన్నాడు.

ఆ మరుక్షణం సర్పనఖుడు కాళ్ళతో నేలను గట్టిగా తాటించి, సిద్ధసాధకుడి మీదికి ఉరికాడు. ఒక్క నిమిష కాలం గడవకుండానే సాధకుడు, వాడి నడుం పట్టుకుని పైకెత్తి విసిరి, వాడు నేలమీద పడకముందే పట్టు కోవాలని చూశాడు. ఆ సమయంలో సాధకు డికి వాడి మెడా, ఒక కాలూ దొరికాయి. సాధకుడు పరమానందపడిపోతూ, సర్పనఖుణ్ణి గాలిలో గిరగిరా తిప్పి, ''ఆహా, వీడు మహాకాలుడికి ప్రశస్తమైన బలిపశువవుతాడు. ఏమాత్రం సందేహం లేదు!'' అంటూ నేల మీద దభీ మని పడవేశాడు.

సర్పనఖుడు వెల్లికిలా పడి లేచి కూర్చుని గడగడ వణికిపోతూ, ''అయ్యలారా! నన్ను చంపకండి. నేనూ, నా తమ్ముడూ మకర కేతు అనేవాణ్ణి వెతుకుతూ, ఈ ప్రాంతాలకు వచ్చాం. నా తమ్ముడు సర్పస్వరుణ్ణి, భయం కరమైన నరవానరం ఒకటి ఎత్తుకుపోయింది. వాణ్ణి ఈ అరణ్యంలో వెతికి పట్టుకుని, నా దారిన నేను పోతాను,'' అన్నాడు.

''సర్పనఖా, అలా దారికి రా,'' అని జయ శీలుడు సిద్ధసాధకుడితో, ''సాధకా, వీణ్ణి బలిపెట్టడానికి ఇంకా సమయం వున్నది,'' అంటూ నవ్వి, సర్పనఖుడితో, ''నీ తమ్ముణ్ణి వెతికే ప్రయత్నంలో మేము సాయపడ తాము. కాని, నువ్వనే మాయాసరోవరేశ్వరు డుండే చోటుకు మమ్మల్ని తీసుకుపోతానని మాత్రం ముందుగా వాగ్దానం చెయ్యి,'' అన్నాడు.

ఇది వింటూనే సర్పనఖుడు వెలవెల పోతూ గుడ్లు తేలవేసి, ''ఆయన వుండే సరోవరం ఎక్కడ వున్నదో చెబితే, నా తల బద్దలవుతుంది. అలా అని శాపం!'' అన్నాడు.

''ఆ శాపమేదో నేనే అమలుచేస్తాను!'' అంటూ జయశీలుడు కత్తి దూసేంతలో, దూరంగా కేకలు వినిపించాయి. అందరూ తలలు తిప్పి అటుకేసి చూశారు.

కృపాణజిత్తు ఒక జలాశ్వాన్ని ఎక్కి కత్తి తిప్పుతూ, ''జయశీలుడెక్కడ? వాడి నేస్తగాడు కాపాలికుడెక్కడ? వాళ్ళను నా కత్తికి బలిపెడతాను,'' అంటూ దూరంగా చెట్ల కింద గుర్రాన్ని పరిగెత్తించసాగాడు.

కృపాణజిత్తును చూస్తూనే సిద్ధసాధకుడు శూలాన్ని పైకెత్తి, ''ఆహా, ఎంతకాలానికి ఈ

కృపాణజిత్తు, నా శూలం పోటుకు దొరకపో తున్నాడు,'' అంటూ బయలుదేరాడు.

సర్పనఖుడు చప్పున పోయి సిద్ధసాధకుడి చేయి పట్టుకుని, ''అయ్యా, ఆగండి, ఒక్క మాట! ఈ దుష్టుడి నరవానరమేగదా, నా తమ్ముణ్ణి ఎత్తుకుపోయింది. వీణ్ణి చంపే ముందు, ఆ వానరం ఎక్కడున్నదో తెలుసుకో నివ్వండి,'' అన్నాడు.

జయశీలుడు కత్తిని సర్పనఖుడికి ఇచ్చి వేసి, ''ఆ కృపాణజిత్తు కత్తియుద్ధంలో ఆరి తేరినవాడు. తగు జాగ్రత్తలో వుండు!'' అని హెచ్చరించి, సాధకుడితో కలిసి చెట్టు చాటుకు వెళ్ళాడు.

అంతలో కృపాణజిత్తు జలాశ్వాన్ని పరి గెత్తిస్తూ, సర్పనఖుణ్ణి చూసి ఆగి, ''ఎవరు నువ్వు? గడెకొండగూడెంలో నా మెడకు తాడు బిగించినవాడివా?'' అని ప్రశ్నించాడు.

''అవును! నువ్విప్పుడు ఎక్కివున్నది, నా తమ్ముడి జలాశ్వం. వాణ్ణి ఏం చేశావు?'' అంటూ సర్పనఖుడు తన అశ్వాన్ని, కృపాణ జిత్తుకేసి అదిలించాడు.

కృపాణజిత్తు రెండు చేతులూ పైకెత్తి, ''నువ్వు వున్న చోటునే ఆగు. నరవానరం హఠాత్తుగా పైనపడి జలాశ్వం మీద వున్న, నీ తమ్ముణ్ణి ఎత్తుకుపోయింది. దీన్ని గూడెం పక్కన వున్న చెట్లలో తిరుగుతూవుంటే పట్టు కున్నాను,'' అన్నాడు.

''నేనడిగినదానికి సూటిగా జవాబు చెప్పు. నా తమ్ముడెక్కడ?'' అంటూ సర్పనఖుడు కత్తి పైకెత్తాడు.

''సర్పనఖా, తొందరపడకు. విధి బలీయం అన్నారు. నీ తమ్ముడికి ఆ వానరం చేతిలో



చావు రాసిపెట్టి వుంటే – ఈపాటికి అదే జరిగి ఉంటుంది! నేను మనిద్దరి శత్రువులైన జయ శీల, కాపాలికులను వేటాడేందుకు అరణ్య మంతా గాలిస్తున్నాను. వాళ్ళిద్దరూ, నీ తోటి వాడైన మకరకేతును ఎంతగా హింస పెట్టారో, అరణ్యంలోని ఆదివాసులద్వారా లోగడ నేను విని వున్నాను,'' అన్నాడు కృపాణజిత్తు.

కృపాణజిత్తు మాట ముగించే లోపలే సర్పనఖుడు పెద్దగా అరిచి, ''ఓరే, దుర్మా ర్గుడా! నీమాటలు వింటూంటే, నా తమ్ముడు మరి లేడనిపిస్తున్నది. ముందు నీ తల నరికి, నా తమ్ముడి ఆత్మకు శాంతి చేకూర్చాలి,'' అంటూ, అశ్వాన్ని కత్తి పిడితో గట్టిగా కొట్టాడు.

జలాశ్వం వేగంగా తనకేసి రావడం చూస్తూనే, కృపాణజిత్తు భయంతో కంపించి పోతూ, తన అశ్వాన్ని వెనక్కు తిప్పి, ''నా గర్భ శత్రువైన జయశీలుణ్ణి చంపిగాని, నేను చావను. అందువల్ల ప్రస్తుతానికి నేను నీతో



పోరాడదలచలేదు,'' అంటూ అశ్వాన్ని దౌడు తీయించసాగాడు.

సర్పనఖుడు, అతడి వెంటబడ్డాడు. చెట్ల చాటున వుండి ఇదంతా చూస్తున్న జయశీలుడు, సిద్ధసాధకుడితో, ''సాధకా, ఆ పారిపోతున్నవాళ్ళల్లో ఒకడు మనకు పరమశత్రువు. రెండోవాణ్ణి మిత్రుడుగా చేసుకోగలిగితే, మనం మాయాసరోవరాన్ని చేరవచ్చు,'' అన్నాడు.

''బహుమంచి ఆలోచన! కాని, ఇద్దరూ మనకందకుండా పారిపోయేలా వున్నారు. ఇప్పుడేం చేసేట్టు?'' అని అడిగాడు సిద్ధసాధకుడు.

ఈ జరుగుతున్నదంతా దూరంగా నిలబడి ఆశ్చర్యపోతూ చూస్తున్న మరుగుజ్జు సేనానిని, జయశీలుడు దగ్గరకు పిలిచి, ''సేనానీ, ఆ పారిపోతున్నవాళ్ళను పట్టుకోవాలి. ఈ చుట్టుపక్కల అంతటా మీ జాతివాళ్ళు వున్నారు కదా! వాళ్ళను హెచ్చరించి, వాళ్ళిద్దర్నీ ప్రాణాలతో పట్టుకుని బంధించగలవా?'' అని అడిగాడు.

''అయ్యా, అదెంతపని! ఢప్పులువాయించి, అంచెలంచెలుగా మావాళ్ళందర్నీ హెచ్చరిస్తాను,'' అని మరుగుజ్జుసేనాని, తన పొటేలు వాహనాన్ని గూడెంకేసి పరిగెత్తించాడు.

''సిద్ధసాధకా, మనం ఆ కనబడే గుట్ట మీదికి పోయి, మరుగుజ్జుజాతివాళ్ళు ఏం చేస్తారో చూద్దాం,'' అంటూ జయశీలుడు బయలుదేరాడు.

''జై, మహాకాళా! మనం హిరణ్యపురాన్నుంచి బయల్దేరిన వేళావిశేషం మంచిది కాదు. ఎన్ని చిక్కులు, ఎన్ని ఇక్కట్లు!'' అంటూ సిద్ధసాధకుడు నిట్టూర్చి, జయశీలుడి వెంట నడిచాడు.

ఆ సమయంలో కృపాణజిత్తును తరుముకుపోతున్న సర్పనఖుడు, అతణ్ణి ఆ అరణ్యవృక్షాల మధ్య తరిమి పట్టుకుని చంపడం సాధ్యమయ్యే పనికాదని గ్రహించి, ''ఒరే, కృపాణజిత్తూ, ఆగు! ఒకవేళ నా తమ్ముడు బతికేవున్నాడేమో, మనకు తెలియదుగదా! నువ్వు, మా జలాశ్వాన్నిచ్చి నీ దారిన పో,'' అన్నాడు.

''అశ్వాన్ని తీసుకుని నన్ను కత్తికి బలిపెట్టవన్న నమ్మకమేమిటి? అట్లని నేను, నీతో పోరాడేందుకు భయపడుతున్నాననుకోకు. యుద్ధంలో విజయం ఎవరిదవుతుందో, ఆ పైనున్న ఒక్క దేవతలకుతప్ప మరెవరికీ తెలియదు. నేను ముందుగా ఆ జయశీలుణ్ణి చంపాలి. ఆ తర్వాత నీ సంగతి చూస్తాను,'' అంటూ కృపాణజిత్తు, జలాశ్వాన్ని మరింత వేగంగా పరిగెత్తిస్తూ నదీతీరాన్ని చేరాడు.

సర్పనఖుడు తనూ జలాశ్వాన్ని గట్టిగా అదిలించి, కొద్దిసేపటికల్లా నదీతీరాన్ని చేరి, దాని ఒడ్డువెంట పారిపోతున్న కృపాణజిత్తు వెంట పడ్డాడు.

ఆ సరికి డప్పుల మోతలు విన్న మరుగుజ్జు జాతివాళ్ళల్లో కొందరు కృపాణజిత్తునూ, సర్పనఖుణ్ణీ చూసి, వాళ్ళ దారిని అటకా యించేందుకు, ఒక గుంపుగా చేరి బళ్ళాలు ఎత్తి పట్టుకుని నిలబడ్డారు. కృపాణ జిత్తు వాళ్ళను అంతదూరంలో వుండగానే చూశాడు. ముందుకు పోతే, తను అంతకు పూర్వం నానా హింసలపాలు చేసిన మరుగుజ్జు వాళ్ళు; వెనుదిరిగితే, తన తమ్ముడికి జరిగిన హానికి, పగ తీర్చుకునేందుకు వెంట తగిలి వస్తున్న సర్పనఖుడు!

ఆ స్థితిలో కృపాణజిత్తుకు అశ్వంతో పాటు నదిలో దూకడమొక్కటే మేలైన మార్గంగా కనిపించింది. ఇలా ఆలోచించి అతడు జలాశ్వాన్ని గట్టుమీది నుంచి నది కేసి మళ్ళించేసరికి, అక్కడ నదీజలంలో తేలియాడుతూ రెండు మొసళ్ళు కనిపించినై. వాటిని చూస్తూనే కృపాణజిత్తు గుండె గుభేలుమన్నది. "గుండెలో గుచ్చుకునే బల్లెంపోటు మంచిదా? వెన్నుమీద పడే కత్తివేటు మంచిదా? లేక నీళ్ళపై తేలుతున్న మొసళ్ళ కరకు కోరల పట్టు మంచిదా? ఛీ, ఇవన్నీ ప్రాణాంతకాలే," అనుకుంటూ, ఎలాగూ చావుతప్పదన్న నిస్పృహలో మొండి ధైర్యం తెచ్చుకుని, "మరుగుజ్జువాళ్ళకన్నా, సర్పనఖుడికన్నా—ఈ మొసళ్ళే కాస్త సాధు జీవులు. పైగా, నేనెక్కి వున్నది నీటి గుర్రం కనక, నీటిలో తన ప్రాణరక్షణ చేసుకునే ప్రయత్నంలో నన్నూ రక్షించక పోదు!" అను కుంటూ అశ్వాన్ని నదిలోకి దూకించాడు.



కృపాణజిత్తు వెనక వస్తున్న సర్పనఖుడు ఇది చూసి, "ఔరా, మతిమాలిన వెధవా, ఎంతపని చేశావు! మొసళ్ళు నీతోపాటు, జలాశ్వాన్ని కూడా తినకుండా కాపాడుకోవాలి. మాయాసరోవరాన్ని చేరడానికి, ఒకవేళ నా తమ్ముడు బతికుంటే, ఈ అశ్వమొక్కటే ఆధారం," అంటూ తనూ అశ్వాన్ని నదిలోకి దూకించాడు.

మొసళ్ళు రెండూ, నీటివాలున పడి కొట్టుకుపోతున్న కృపాణజిత్తు వెంట పడినై. సర్పనఖుడు కత్తి ఎత్తి, వాటిని పొడిచి చంపేం దుకు వెంటబడ్డాడు. ఒడ్డున ఉన్న మరుగుజ్జు వాళ్ళు అక్కడ దొరికిన రాళ్ళనూ, ఎండు కట్టె లనూ కృపాణజిత్తుకేసి విసరసాగారు. సర్పనఖుడు గొంతెత్తి, వాళ్ళతో, "నేను మీ మిత్రుణ్ణి. ఈ దుర్మార్గుణ్ణి ప్రాణాలతో పట్టుకో బోతున్నాను; వాణ్ణి రాళ్ళతో కొట్టకండి!" అని హెచ్చరిస్తూ, మొసళ్ళలో ఒకటి నోరు తెరిచి కృపాణజిత్తు కాలు పట్టుకోబోయేంతలో, దాని వెన్నుమీద కత్తితో బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు మొసలి బాగా గాయపడి, నీళ్ళను అల్లకల్లోలం చేస్తూ తన్నుకోసాగింది. రెండవ మొసలి నది దిగువకు పోయి, పెద్దగా నోరు తెరిచి కృపాణజిత్తుకేసి రాసాగింది. ఇది చూసిన జలాశ్వం బెదిరి, కృపాణజిత్తు ఎంత గట్టిగా కళ్ళెం పట్టుకుని లాగుతున్నా ఆగ కుండా, నది ఒడ్డుకేసి వేగంగా ఈదుకుంటూ పోయి, అక్కడ ప్రాణులను పట్టుకు తినే మృత్యువృక్షం వున్న ప్రదేశాన రొప్పుతూ గట్టుమీదికి ఎక్కింది.

ఆ మృత్యువృక్షానికి కొంచెం దూరంలో నిలబడి వున్న మరుగుజ్జువాళ్ళు, పెద్దగా కేకలుపెడుతూ, "ఒరే, మహాకాయా! గుర్రాన్ని వెనక్కు తిప్పు. లేకపోతే నువ్వు ప్రాణాలు తీసే చెట్టుకు నిలువునా బలైపోతావు," అంటూ కృపాణజిత్తును హెచ్చరించారు.

కాని, జలాశ్వం అతడు ఎంత కళ్ళాన్ని బలంగా లాగినా ఆగకుండా మృత్యువృక్షం కిందికి వచ్చేసింది. అందుబాటులో వున్న కృపాణజిత్తును, మృత్యువృక్షం కొమ్మ ఒకటి మెల్లగా కిందికి వంగి గట్టిగా పట్టుకుని పైకి గుంజసాగింది. —(ఇంకావుంది)





బేతాళ కథలు

# తప్పు ప్రజలది

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతిగొలిపే ఈ శ్మశానంలో, అర్ధరాత్రివేళ ప్రతి ఒక్క సారీ కార్యభంగం కలుగుతున్నా, మరింత పట్టుదలతో కార్యసాధనకు పూనుకోవడంలో నువ్వు కనబరుస్తూన్న ఓర్పూ, దీక్షలను మెచ్చుకోవలసిందే. కాని, ఇంతకూ నువ్వుసాధించదలచిన కార్యం లేక పరిష్కరించ చూస్తున్న సమస్యా, ఏమైవుంటుందో తెలియ డంలేదు. వెనకటికి, విక్రమసింహు డనే రాజు, తన రాజ్యాన్ని చక్కని పరి పాలనాదక్షులైన వారికి అప్పగించే



ప్రయత్నంలో భంగపడినట్టు, నీకూ జరగగల దన్న శంకకలుగుతున్నది. అతడి కథచెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

విశాలదేశాన్నేలే విక్రమసింహ మహా రాజుకు పిల్లలు లేరు. అయినా తన ప్రజలనే కన్నబిడ్డల్లా భావించే ఆ రాజుకు పిల్లల గురించి చింత లేదు. కానీ దేశపౌరులు మాత్రం విక్రమసింహుడి తర్వాత తమ కెలాంటి ప్రభువు వస్తాడోనని బెంగపెట్టు కున్నారు. పౌరుల్లోని కొందరు ప్రముఖులు రాజును కలుసుకుని, ''ప్రభూ! తమరు యోగ్యుడైన చిరంజీవిని దత్తతగా తీసుకుని, ఇప్పటినుంచీ తగిన శిక్షణ ఇస్తే, మాకు మీ అంతటి మహారాజు మళ్ళీ లభ్యం కావచ్చు,'' అని చెప్పారు.

విక్రమసింహుడికీమాటలు వినగానే, రాజు కావాలంటే తనకు వారసుడేకానవసరం లేదనీ, శిక్షణ వుంటే చాలనీ అనిపించింది. ఆ విషయం రాణికి చెబితే, ఆమెకూ అలా చేయడం మంచిదనిపించింది. ఇద్దరూ కలిసి బాగా ఆలోచించాక, మహారాజు వద్ద శిక్షణ పొంది కొత్తరాజు కావడానికిసమర్థులైన యువ కులు ముందుకు రావలసిందని, దేశమం తటా చాటింపు వేయించారు. ఆ చాటింపు విని ఎందరో యువకులు రాజధానికివచ్చారు. మహారాజు స్వయంగా వారందర్నీ పరీక్షిం చాడు. చిట్టచివరకు అన్నివిధాలా సరిసమా నులూ, మిగతా అందరికంటే అధికులూ అనిపించుకున్నారు–సుశాలుడు, కుశాలుడు అనే ఇద్దరు యువకులు.

ఆ ఇద్దరిలో ఒక్కడిని మాత్రమే ఎన్నిక చేయడం రాజుకు అసాధ్యమనిపించింది. ఆయన వారితో, ''మీరిద్దరూ ఎందులోనూ ఒకరికొకరు తీసిపోరు. కానీ మీలో ఒక్కరు మాత్రమే విశాలదేశానికి రాజుకాగలరు. రాజు అంటే సామాన్యమైన పదవి కాదు. రాజు దేవు డితో సమానం. మీరు మానవ ప్రయత్నంతో ఎన్నో విద్యలు నేర్చారు. దైవశక్తితో మరికొన్ని విద్యలు నేర్చుకుని రండి. అందుకు మీకు ఏడాది గడువిస్తున్నాను. ఏడాది తర్వాత మీలో ఎవరెక్కువ దైవానుగ్రహం పొందితే, వారిని విశాలదేశపు రాజును చేస్తాను. ఇక వెళ్ళిరండి!'' అని చెప్పి పంపాడు.

సుశాలుడు, కుశాలుడు సమీపారణ్యం లోకి వెళ్ళి తీవ్రంగా తపస్సు చేశారు. ఏడాది తిరక్కుండా వారిరువురికీ దేవుడు ప్రత్యక్షమై ఏం కావాలో కోరుకోమన్నాడు.

''నా దేశంలో ప్రజలు సుఖంగా వుండాలి,'' అని కోరాడు సుశాలుడు.

దేవుడు ప్రసన్నుడై, ''నాయనా! నీవు ఎటువంటి క్లిష్టసమస్యనైనా పరిష్కరించగల మేధాశక్తిని కలిగి వుంటావు. ప్రకృతి ఋతు ధర్మాన్ని పాటిస్తుంది. ఎటువంటి రోగానికైనా మందు కనిపెట్టగల వైద్యప్రముఖులు నీ దేశంలో రాణిస్తారు. ఎటొచ్చీ నీవు దేశానికి రాజువు కావాలి. అప్పుడే నేనిచ్చిన వరాలు నీకు పనిచేస్తాయి,'' అని చెప్పి మాయ మయ్యాడు.

ఆ తర్వాత దేవుడు, కుశాలుడికి ప్రత్య క్షంకాగానే అతడు, ''నా ప్రజలు నా మాటను శిలాశాసనంగా భావించాలి. నాకెదురు తిరి గినవారిని సర్వనాశనం చేయగల శక్తి నాకుం డాలి. నాకూ, నన్ను నమ్మినవారికీ నిరంతరం విలాసాలూ, వైభోగాలూ వుండాలి,'' అని కోరుకున్నాడు.

''తథాస్తు! అయితే, నీవు దేశానికి రాజు వైనప్పుడే నేనిచ్చిన వరాలు పనిచేస్తాయి. నా వరాలు నీకూ, నీ దేశానికీ మాత్రమే పరి మితమవుతాయి,'' అని వరమిచ్చి మాయ మయ్యాడు దేవుడు.

కుశాలుడు, సుశాలుడు విశాల రాజ ధానికి తిరిగివెళ్ళి, రాజు విక్రమసింహుణ్ణి కలుసుకుని, తాము సాధించిన దైవశక్తుల గురించి చెప్పారు. ఆయన జరిగినదంతా విని, '' ఏదేశానికైనా ప్రజలను కన్నబిడ్డల్లా చూసుకునే రాజుండాలి. శత్రువులను సర్వ నాశనం చేయగల శక్తి, ఆ రాజుకుండాలి. ఇందుకుగాను—మీలో ఇద్దరికీ చెరిసగం లక్షణాలు మాత్రమే వున్నాయి. పోనీ ఒకరిని రాజు, ఇంకొకరిని సేనాధిపతి చేద్దామా అంటే, మీరు రాజుకాగలిగినప్పుడే మీ శక్తులు పని





చేస్తాయి. ఇద్దరి శక్తులూ ఒకేసారి ఉపయోగించుకునే అవకాశం దేశానికి లేకుండా పోవడం, నాకు అంతగా నచ్చలేదు. అందువల్ల, నేను అరణ్యానికి వెళ్ళి దేవుణ్ణి ప్రార్థించి మీ శక్తుల్ని దేశానికి ఉపయోగపడేలా చేస్తాను. ఈ లోగా మీరు కొంత కాలంపాటు ప్రజలమధ్య సంచరిస్తూ, వారి కోసం మీరే మేంచేయగలరో చెప్పుకుని ప్రజాభిమానం పొందండి,'' అని చెప్పాడు.

ఆ ప్రకారం సుశాలుడు, కుశాలుడు ప్రజల మధ్యకు వెళ్ళారు. రాజ్యాన్ని మంత్రులకప్పగించి విక్రమసింహుడు సమీపారణ్యానికి వెళ్ళి, మూడుమాసాలపాటు కఠోర తపస్సు చేయగా, ఆయనకు దేవుడు ప్రత్యక్షమయ్యాడు. ఆయన రాజు మనస్తాపం గురించి తెలుసుకుని, ''నాయనా! సుశాలుడు మంచివాడు, కుశాలుడు చెడ్డవాడు. తమ బుద్ధులకు తగినట్టు వారు కోర్కెలు కోరారు. వారి తపస్సుకు మెచ్చి నేను వారి కోర్కెలు తీర్చాను,'' అని వివరించి చెప్పాడు.

విక్రమసింహుడు వెంటనే, ''లోకపాలకా! మంచివాడి కోర్కెలు తీర్చావు సరే, చెడ్డవాడని తెలిసే నువ్వు కుశాలుడి కోరిక ఎందుకు తీర్చావు?'' అని అడిగాడు.

''నాకు వాళ్ళవాళ్ళ నియమనిష్ఠలే తప్ప మంచిచెడ్డలు ముఖ్యం కాదు. అయినా, రాజైనప్పుడే వారివరాలు పనిచేస్తాయని నియమంపెట్టాను గదా! వారిలో ఎవరిని రాజును చేయాలన్న శంక నీకు తగదు. ఆ నిర్ణయాన్ని ప్రజలకేవిడిచిపెట్టు. ప్రజల్లోనూ మంచివారూ, చెడ్డవారూ వుంటారు. నీ విశాలదేశాన్ని రెండు భాగాలు చేయి. సుశాలుణ్ణి కోరుకున్న వారందరూ ఒక భాగంలో వుంటారు. కుశాలుణ్ణి కోరుకున్నవారందరూ రెండో భాగంలో వుంటారు. వాళ్ళిద్దరూ చెరోభాగానికీ చెరొకరూ రాజుగా వుంటారు. నీ సమస్య తీరినట్లేకదా! ఇక ప్రజల సమస్య అంటావూ, అది వారు కోరి తెచ్చుకున్నదే కాబట్టి, నీకు చింత వలదు,'' అని మాయమయ్యాడు దేవుడు.

తెలిసీ తెలిసీ చెడ్డవాళ్ళను రాజుగా కోరుకునే ప్రజలుంటారా అని విక్రమసింహుడనుకున్నాడు. కానీ ఆయన రాజధానికివెళ్ళి సుశాలుణ్ణీ, కుశాలుణ్ణీ రాజులుగా ప్రకటించగానే, ఎక్కువభాగం ప్రజలు సుశాలుణ్ణీ, తక్కువభాగం ప్రజలు కుశాలుణ్ణీ కోరుకున్నారు. ప్రజల నిష్పత్తి ప్రకారం పెద్దభాగాన్ని సుశాలుడికీ, చిన్నభాగాన్ని కుశాలుడికీ అప్పగించాడు, విక్రమసింహుడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా! విక్రమసింహుడు తీసుకున్న నిర్ణయంలో నాకు

ముఖ్యంగా రెండు సందేహాలు కలుగుతున్నాయి. ప్రజలను కన్నబిడ్డల్లా పాలించే విక్రమసింహుడు—తపస్సు చేసి దేవుణ్ణి మెప్పించి ప్రజాక్షేమమే వరంగా పొందిన సుశాలుణ్ణి రాజుగా చేయక, తానే మళ్ళీ తపస్సుకు వెళ్ళడం విడ్డూరంగా లేదా? ఇక దేవుడు వరాలివ్వడానికి, నియమ నిష్ఠలతో చేసే తపస్సు తప్ప, వాళ్ళ గుణగణాలు ముఖ్యం కాదు అనడం ఎంతవరకు సమంజసం? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఏ దేశప్రజలైనా సుఖశాంతులతో వర్ధిల్లాలంటే ప్రజాక్షేమం, శత్రు నిర్మూలనం రెండూ అవసరం. అయితే, సుశాలుడూ, కుశాలుడూ పొందిన వరాలలో చెరిసగం లక్షణాలు మాత్రమే ఉన్నాయి. ఒకవేళ సుశాలుణ్ణి రాజును చేస్తే, కుశాలుడు దుర్బుద్ధితో అతన్ని హతమార్చే అపాయం కూడా లేకపోలేదు. అందుకే రాజు తపస్సు చేసి దేవుడిచ్చిన సహాలను పాటించాడు. ఇక వరాల గురించి దేవుడు చెప్పిన సంగతి అక్షరాలా నిజం. దుర్మార్గ స్వభావులు ఎంతటి నియమ నిష్ఠలతో కఠోర తపస్సు చేసి వరాలు పొందినప్పటికీ, వాటిపర్యవసానాలు వారికి కీడు కలిగిస్తాయే తప్ప మేలుచేయవు. ఇందులో దేవుడి ప్రమేయం ఏమీలేదు. దుష్టస్వభావులు దుష్టవరాలనే కోరుకుంటారు. చివరికి అవే వారికి వినాశం కలిగిస్తాయి. పురాణాలు చాటే సత్యం కూడా ఇదే. అయితే, అలాంటి దుర్మార్గుల బారినుంచి మంచివారిని రక్షించడం, దుష్టుల నుంచి దూరంగా ఉంచడం పాలకుల బాధ్యత. అందుకే తమ రాజును నిర్ణయించే బాధ్యతను ప్రజలకే వదిలిపెట్టమని దేవుడు విక్రమసింహుడికి సూచించాడు. అధిక సంఖ్యాకులైన మంచివారు సుశాలుణ్ణీ, అల్పసంఖ్యాకులైన చెడ్డవారు కుశాలుణ్ణీ కోరుకున్నారు. మనుషుల స్వభావాలే వారి మంచి చెడ్డలను నిర్ణయిస్తాయి. వాటినిబట్టే సుఖదుఃఖాలు ప్రాప్తిస్తాయి. అతిక్రమించలేని ప్రకృతి ధర్మం ఇది. అందువల్ల దేవుడు ఇచ్చిన వరం ఏమాత్రం అసమంజసం, అసహజం కాదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

కల్పితం

[ఆధారం: ''వసుంధర'' రచన]



మన పూర్వగాథలు: 7

# ఐరావతం కథ



కోపానికి మారుపేరు దుర్వాసముని. ఎదుటివారు చిన్న పొరబాటు చేస్తే చాలు మండిపడేవాడు. అపరాధం, ధిక్కారం అణుమాత్రం ఉన్నా ఆగ్రహావేశంతో శపించే మనస్తత్వం ఆయనది. గొప్ప తపోసంపన్నుడు కావడంతో ఆయన శాపం తప్పక ఫలించేది. ఒకవేళ ఆయనే కావాలనుకున్నా శాపవిముక్తి దుర్లభంగా ఉండేది. అయినా శాపం ఇచ్చాక శాంతించి, శాప ప్రభావాన్ని కొంచెం తగ్గించేవాడు. ఆయన ఇచ్చిన శాపమే శాపగ్రస్తులకు చివరికి వరంగా పరిణమించిన సందర్భాలు కూడా లేకపోలేదు.

మన పురాణాల ప్రకారం సృష్టిస్థితి లయాలకు కారకులైన త్రిమూర్తులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సర్వశక్తి సంపన్నులు. సత్వ గుణ సంపన్నులైన ఇతర దేవతలు దేవలోకంలో ఉండేవారు. ఇంద్రుడు వీరి అధిపతి. దేవతలకు జరామరణాలు లేవు. నిత్య యౌవనులు! వీరికీ, రాక్షసులకూ తరచూ యుద్ధాలు జరుగుతూ ఉండేవి.

ఒకానొకప్పుడు దుర్వాసముని దేవ లోకానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో వన విహారం చేస్తూన్న ఒక విద్యాధరకాంత మునిని చూసి నమస్కరించి, ఆయనకు ఒక పుష్పమాలికను కానుకగా సమర్పించింది. ఆకర్షణీయమైన రంగురంగుల పుష్పాలతో దివ్య పరిమళాలు వెదజల్లుతోంది ఆ పుష్ప మాలిక. దానిని చూసి దుర్వాసుడు చాలా సంతోషించాడు. అయినా దానిని ధరించడానికి వెనుకాడాడు. మునులకు దేనిపట్లా బంధాలు ఉండకూడదు కదా!

ఆయన తిన్నగా దేవసభకు వెళ్ళాడు. ఆయన్ను చూడగానే దేవేంద్రుడు సింహాసనంపైనుంచి లేచి సాదరంగా స్వాగతం పలి

బిందుసార్

కాడు. ముని సంతసించి చేతిలోని మాలను ఇచ్చాడు. ఇంద్రుడు దానిని ఆనందంగా స్వీకరించాడు.

దుర్వాసుడు మరికొంతసేపు అక్కడ గడిపి, భూలోకానికి పయనమయ్యాడు. ఇంద్రుడు ముని వెంట సభాభవనం వెలుపలిదాకా వచ్చి, సగౌరవంగా వీడ్కోలు పలికాడు.

ఆ తరవాత ఇంద్రుడు వెనుదిరిగి వెళుతూ బయట ఉన్న తన వాహనం ఐరావతాన్ని చూడగానే, ఆయనకు ఒక ఆలోచన వచ్చింది. దుర్వాసముని ఇచ్చిన పుష్పమాలికను ఏనుగుకు అలంకరించినట్టయితే, అది మరింత ఆకర్షణీయంగా కనిపించగలదని ఆయనకు అనిపించింది. మాలను తీసి ఐరావతం మెడలో వేశాడు. ఐరావతం సంతోషంతో ఉప్పొంగిపోయింది. దానిని చూసి నవ్వుతూ దేవేంద్రుడు సభలోకి వెళ్ళాడు.

ఆ తరవాత కొంతసేపటికి, పుష్పమాలిక సువాసనకు ఆకర్షింపబడిన తేనెటీగల గుంపొకటి దానిపై వాలింది. ఇది ఐరావతానికి ఇబ్బంది కలిగించింది. ఎంతకూ తేనెటీ గల బాధ తగ్గకపోయేసరికి ఏనుగు తొండంతో ఆ మాలను తీసి దూరంగా విసిరివేసింది. దాంతో తేనెటీగల బాధనుంచి బయటపడింది.

ఈ సంగతి తర్వాత దుర్వాసుడికి తెలియవచ్చింది. తాను ఇచ్చిన పుష్పమాలికను ఉదాసీనం చేసి తనను ఇంద్రుడు కించపరిచాడని కుంచించుకుపోయాడు. పైగా, ఇంద్రుడు నిర్లక్ష్యంగా పుష్పమాలను ఏనుగు మీదికి విసిరాడనీ, ఏనుగు ఆడుకుంటూ దానిని చిందరవందర చేసిందనీ ఎవరో చెప్పడంతో ముని ఆగ్రహంతో భగ్గుమన్నాడు. ''యౌవన గర్వంతో కన్నుగానక విర్రవీగుతున్న దేవతలారా! మీ యౌవనం నశించుగాక!



మానవుల్లాగా జరాభార పీడితులగుదురు గాక!'' అని శపించాడు.

ఆ శాపాన్ని విన్న అక్కడి మునులందరూ దిగ్భ్రాంతి చెందారు. ''ఎంతపని చేశావు ముని సత్తమా!'' అని వాపోయారు.

కోపం తగ్గాక దుర్వాసముని సైతం, తన శాపపర్యవసానాలను ఊహించి విచారించాడు. దేవతలు సైతం మానవుల్లాగే వృద్ధులైపోతే, బలహీనులై దానవుల చేతుల్లో ఓడిపోగలరు. రాక్షసులు జయిస్తే, దేవతలతోపాటు మానవులకు కూడా ముప్పు తప్పదు. రాక్షసులు దురహంకారపూరితులూ, దుర్మార్గులూ గనక, మానవులకు స్వేచ్ఛ ఉండదు. సత్య ధర్మాలను అనుసరించడాన్ని అనుమతించరు. భూలోకం రాక్షసుల వశమైతే మానవ ప్రగతి ఆగిపోతుంది!

దీనినంతా గ్రహించిన మునులు శాప విమోచన మార్గం సూచించమని దుర్వాసుణ్ణి వేడుకున్నారు. దుర్వాసముని వాస్తవ పరిస్థితులను గ్రహించి, ''క్షీరసాగరాన్ని మథించి అందులో నుంచి వెలువడే అమృతాన్ని సేవించినట్టయితే, దేవతల ముసలితనం పోయి మళ్ళీ యౌవనం పొందగలరు!'' అని చెప్పాడు.

దిక్కు తోచక విచారిస్తున్న దేవతలకు ఇది ఆశాజ్యోతిలా కనిపించింది. అయినా క్షీరసాగరాన్ని ఎలా మథించడం? ఆ మహత్కార్యాన్ని తామొక్కరే స్వయంగా చేయలేరు కదా? అందుకు రాక్షసుల సహకారం కూడా కావాలి. వెళ్ళి అడిగారు. తమకూ అమృతం లభిస్తుందన్న ఆశతో అసురులు అందుకు అంగీకరించారు. ఆ తరవాత జరిగినదంతా వేరొక పెద్ద కథ!

ఇక ఐరావతం విషయానికి వస్తే — పుష్ప మాలికను తాను దూరంగా విసిరినందువల్లే దేవతలకు ఇన్ని కష్టాలు దాపురించాయన్న అపరాధభావంతో కుంగిపోయింది. దేవతల ముందు నిలబడలేక, వారికి తన ముఖం చూపలేక క్షీరసాగరంలో వెళ్ళి దాక్కున్నది.

క్షీరసాగర మథన సమయంలో అమృతం రావడానికి ముందు, ఐరావతం వెలుపలికి వచ్చింది. అయితే ఇప్పుడు దాని ఒళ్ళంతా తెల్లగా మారిపోయింది. కొంతకాలం క్షీర సాగర గర్భంలో ఉండడం వల్ల, దానికీ శ్వేత వర్ణం వచ్చింది. మునుపటిలా అది మళ్ళీ ఇంద్రుడి వాహనం అయింది!





పి.పవన్‌కుమార్
బళ్ళారి



అర్చన జగతాప్
సంగ్లి



# రాజకీయం

మేరుపురి రాజభవనంలోని, ఒక విశాలమైన గదిలో, మహారాజు శివతేజ, మంత్రి బుధాదిత్యుడు, యువరాజు విశ్వసేనుడు తమతమ ఆసనాల మీద మౌనంగా కూర్చుని వున్నారు. ఈ మౌనానికి కారణం మహారాజు తన కుమారుడు విశ్వసేనుణ్ణి రాజ్యపాలనా బాధ్యతలు తీసుకోమని కోరడం, అందుకు యువరాజు నిరాకరించడం! రాజు ఈ నిరాకరణకు కారణమేమిటని ప్రశ్నించినప్పుడు, యువరాజు ఏ కొద్దిపాటి జంకూ కొంకులు కూడా లేకుండా తండ్రితో, "నాన్నా! రాజ్య పాలన అనేది ఒక రాజకీయ వలయం. అందులో ప్రవేశించాలన్న కోరికనాకు లేదు. నా జీవితాశయం గొప్పనటుడు కావాలని!" అని జవాబిచ్చాడు.

ఈ జవాబు విని రాజు శివతేజ ఖిన్నుడైపోయి మౌనంగావూరుకున్నాడు. మంత్రి బుధాదిత్యుడికి అది వింతగానే కాక, ఏమాత్రం క్షత్రియోచితం అనిపించ లేదు. ఆయన కొద్దిసేపుతర్వాత యువరాజును, "క్షత్రియ ధర్మమైన రాజ్యపరిపాలనా బాధ్యతలు వదిలి, నటుడిగా జీవితం గడపాలనే, ఈ వింత ఆలోచన మీకెలా కలిగింది?" అని అడిగాడు. అందుకు విశ్వసేనుడు మందహాసం చేసి, "మంత్రి వర్యా! ఉన్నది లేనట్టుగా, లేనిది ఉన్నట్టుగా భ్రమింపజేసి, ప్రజలకు సంభ్రమాశ్చర్యాలు కలిగించేది నటన. ఆ నటనద్వారా ప్రజలను ఆహ్లాదపరచడం, నా జీవితాశయం. నలంద విశ్వవిద్యాలయంలో త్వరలో నిర్వహించబడే నటనా శిబిరంలో చేరి, ఉన్నత స్థాయి నటుణ్ణి కాదలచాను. అంతగా నాన్నగారు రాజ్యభారాన్ని అప్పగించాలనుకుంటే, నా తమ్ముడు చిరంజీవి జయంతుడికి అప్పగించవచ్చు," అన్నాడు.

ఇది విన్న శివతేజ మహారాజు ఒక్కసారిగా ఆగ్రహోదగ్రుడై "మూర్ఖుడా! క్షత్రియ వంశంలో పుట్టి, రాజోచితమైన విద్యలభ్యసించిన నీవు, నటన పేరుతో ఊరూరా తిరుగుతూ తైతక్కలాడతావా? మర్యాదగా నేను చెప్పినట్టు చేయడం తప్ప, నీకు మరే గత్యంతరమూ లేదు. బుద్ధిగా మసలుకో!" అన్నాడు.




ఈ అతితీవ్రవాతావరణాన్ని శాంత పరిచేందుకు మంత్రి, "మహా రాజా! ప్రశాంతంగా ఆలోచించుకోవడానికి యువరాజుకు రెండు రోజుల వ్యవధి ఇవ్వటం ఉచితం!" అన్నాడు.







ఇందుకు రాజు శివతేజ తన అంగీకారం తెలిపాడు. ఆ రెండు రోజులూ గడిచాక తిరిగి ముగ్గురూ సమావేశమయ్యారు. విశ్వసేనుడు తాను నటుడి జీవితాన్నే కోరుకుంటున్నానని తన పాతపాట మరొకసారి వినిపించాడు. అప్పుడు మంత్రి, "యువరాజా! నువ్వు నీ నిర్ణయాన్ని మార్చుకోవని, మేము ముందే ఊహించాం, సరే! నిన్ను నలంద విశ్వవిద్యాలయానికి పంపడానికి, మీ నాన్నగారు సమ్మతించారు. అయితే, ముందుగా మీ నాన్నగారికి ఒక చిన్నపని చేసిపెట్టాలి," అన్నాడు.

ఇందుకు విశ్వసేనుడు సంతోషంగా అంగీకరించాడు. అప్పుడు రాజు, "బాబూ! మన సామంత రాజు వసంతసేనుడు కొద్దిరోజులుగా జబ్బుతో మంచం పట్టి వున్నాడు. ఆయన కోలుకోవడానికి నెలరోజులు పట్టవచ్చునన్నది వైద్యుల అంచనా. అందువల్ల నువ్వు సంభ్రమపురికి వెళ్ళి, ఆయనకు బదులుగా రాజ్య పాలన చూడాలి," అన్నాడు.



"నాన్నా, మీ ఆజ్ఞ నాకు శిరోధార్యం!" అన్నాడు విశ్వసేనుడు ఎంతో అణకువగా. ఆ తర్వాత నాలుగు రోజులకు విశ్వసేనుడు సంభ్రమపురికి చేరుకున్నాడు. ఆ మరునాడు అతడు సభామందిరానికి బయలు దేరుతూండగా భటుడొకడు చక్రవర్తి నుంచి లేఖ అంటూ, అతడికి ఒక ఉత్తరం ఇచ్చాడు. అందులో రాజు శివతేజ, విశ్వసేనుడి తల్లిని ఉద్యానంలో పాము కాటు వేసిందనీ, వైద్యులు చికిత్స చేస్తున్నారనీ రాసి వున్నది. అది చదివి అతడు మ్రాన్పడిపోయాడు. అంతలో మంత్రి అక్కడికి వచ్చి, అతడికోసం సభికులు ఎదురు చూస్తున్నట్టు విన్నవించాడు.

మనస్సు కకావికలమయిపోతున్న విశ్వసేనుడు, చిరునవ్వుతో మంత్రిని అనుసరించి సభకు వెళ్ళాడు. సభలో పరిపాలనకు సంబంధించిన ఎన్నో విషయాల గురించి చర్చలు జరిగాయి. అన్నిటినీ అతడు ఎంతో చాకచక్యంగా నిర్వహించాడు.



రెండవ రోజున విశ్వసేనుడు ఉదయం ఉద్యా



నంలో వుండగా సంభ్రమపురి మంత్రి అక్కడికి వచ్చి, "యువరాజా!మన రాజ్యంలో చెరువులు తవ్వించడానికి పదివేల వరహాలు అనుమతిస్తున్న ఈ పత్రంలో తమ చేవ్రాలు కావాలి," అన్నాడు.

"పదివేల వరహాలతో ఎన్ని చెరువులు తవ్వించబోతున్నారు?" అని అడిగాడు విశ్వసేనుడు.

దానికి మంత్రి కాస్త వెటకారంగా, "మేము చక్రవర్తికి చాలా పెద్దమొత్తమే కప్పం కడుతున్నాం," అని ఒక క్షణం ఆగి, "పదివేలతో నాలుగైదు చెరువులు తవ్వించవచ్చు," అన్నాడు.

ఆ సమాధానానికి మనసులో మండిపడిన విశ్వసేనుడు దాన్ని పైకి కనబరచకుండా, "మంత్రివర్యా! పోయిన ఏడాది మీరు మాకు కట్టిన కప్పం రెండు లక్షల వరహాలు. ఏదో రాజ్యం ఈతిబాధల్లో వున్నదని వినతిపత్రాలు పంపి, మా నుంచి మీరు పొందిన సహాయం మూడు లక్షల వరహాలు. ఇదంతా మరిచిపోయినట్టున్నారే!" అన్నాడు.

ఆ జవాబుతో మంత్రి మారు పలకకుండా అక్కడి నుంచి చల్లగా జారుకున్నాడు. రాత్రి తొలి జాము గడుస్తూండగా, అతడికి తండ్రి నుంచి వార్తా

హరుడిద్వారా ఒక లేఖ వచ్చింది. అందులో, అతడి తల్లికి పాము కాటునుంచి ప్రాణాపదభయం తీరిపోయిందనీ, క్రమంగా కోలుకుంటున్నదనీ వున్నది.

ఈ వార్త విశ్వసేనుణ్ణి ఎంతో సంతోషపరిచింది. అతడిక నిద్రకు ఉపక్రమిద్దామనుకుంటూండగా, నగరరక్షకుడు హడావిడిగా వచ్చి, "యువరాజా, నగరం చుట్టుపక్కల వున్న అడవుల నుంచి బందిపోట్లు వచ్చి పడ్డారు. వాళ్ళల్లో ప్రతివాడి చేతిలో ఒక కాగడా! వాళ్ళు కేకలతో అరుపులతో పౌరుల్ని భయభ్రాంతుల్ని చేస్తున్నారు," అని చెప్పాడు.

విశ్వసేనుడు, కాగడా అన్నమాట వింటూనే ఆశ్చర్యపోయి, "ఈనాటి పున్నమి వెన్నెలలో దొంగలు కాగడాలతో నగరాన్ని దోచుకునేందుకు రావడమా, ఆశ్చర్యం! వాళ్ళంత రాటుతేలిన బందిపోట్లయి వుండరు. నేను వస్తున్నాను. కాగడా చేతిలో వున్న ప్రతి ఒక్కణ్ణీ పట్టిబంధించడం చాలా తేలిక," అంటూ బయలుదేరి, వెంట వచ్చిన భటులను ప్రోత్సహించి ఒక గంట కాలం గడవకముందే, దొంగలను పట్టి కారాగారంలో



వేయించాడు.



తెల్లవారాక రాజు వసంత సేనుడు అతణ్ణి చూడవచ్చి, "యువరాజా, మీరు వచ్చిన ఈ రెండు రోజులలోనే, నా ఆరోగ్యం కుదుట పడటం, మీరు కాలుమోపిన వేళావిశేషం. ఇక నేను రాజ్యబాధ్యతలను స్వీకరించ గలను," అన్నాడు వినయంగా.

విశ్వసేనుడు ఎంతో తృప్తిగా, "వసంతసేనా! ఈ రెండు రోజులూ రాజ్యపాలనా వ్యవహారాల్లో మునిగి తేలటంవల్ల నాకెంతో మేలుజరిగింది. ఈ రోజునే బయలుదేరి మా రాజ్యానికి వెళుతున్నాను," అన్నాడు.

విశ్వసేనుడు తిరిగి రాగానే తండ్రీ, మంత్రులతో సమావేశం జరిగింది. మంత్రి అతడితో, "యువరాజా! మీరు నలంద విశ్వవిద్యాలయానికి వెళ్ళేందుకు అన్ని ఏర్పాట్లూ చేస్తున్నాం. ఒక వారంలో మీ ప్రయాణం," అన్నాడు.



"అలాగా!" అంటూ విశ్వసేనుడు చిరునవ్వు నవ్వి, "మంత్రివర్యా! సంభ్రమపురి రాజ్యం బాధ్యతలు స్వీక రించినప్పటినుంచీ, నేను రాజు అనే వేషం వేశాను. నా మనసులోని భావాలకు వ్యతిరేకమైన భావాలను ఎన్నిటినో క్షణాలలో నటించాను. ఎటువంటి అభ్యా సముకానీ, ముందుగా తయారు చేసుకున్న సంభా షణలు కానీ, ఎదుటా, పక్కలా వెలిగే దీపాలుగానీ లేకుండానే-నా రాజు పాత్రలో నేను జీవించాను, నా నటనాసక్తి ఇదే సరిఅయిన, సంతృప్తికరమైన పద్ధతి అని, నాకనిపించింది. పరిపాలనా రాజకీయవాల్లో నటన పాత్ర, నాకర్థమయింది. అందువల్ల, నేను ప్రత్యేకంగా నటనను గురించిన శిక్షణను అభ్య సించటం వ్యర్థం అని గ్రహించాను. నాన్నగారి ఆలో చనను శిరసావహించి, రాజ్యభారం స్వీకరించాలని నిర్ణయించుకున్నాను," అన్నాడు.

ఇది వింటూనే శివతేజ మహారాజు సంతోషంతో లేచి వచ్చి కొడుకును కౌగలించుకుని, "బాబూ! వారం రోజుల్లో నీ పట్టాభిషేకం జరగబోతున్నది!" అని చెబుతూ, మంత్రికేసి చూడగా, మంత్రి చిరు నవ్వులు చిందించాడు.





# చిలుక పలుకు!





సోమనాథ్ బారిక్
జైపూర్

విక్రమపురి రాజు విక్రమభానుడు ఎల్లవేళలా విలాసాలలో తేలియాడే స్వభావం కలవాడు. ప్రజల బాగోగుల గురించిగానీ, వారి సమస్యల గురించిగానీ పట్టించుకునేవాడు కాదు.

ఒకనాడు మంత్రి, ప్రజలు తినడానికి తిండి కూడా లేకుండా అలమటిస్తున్నారనీ, రాజ్యంలో ఆకలిచావులు పెరిగిపోతున్నాయనీ రాజుతో చెప్పాడు.

''ఆహారధాన్యాలకేమయింది?'' అని అడిగాడు రాజు.

''మూడేళ్ళుగా వర్షాలు లేవు ప్రభూ! పంటలు పండక ఆహారధాన్యాల కొరత ఏర్పడింది,'' అని చెప్పాడు మంత్రి.

''మరి మేఘాలకేమయింది? ఎందుకు వర్షించడం లేదు? ఇంతమంది ఉంటూ సకాలంలో వర్షాలు కురిపించలేరా?'' అని గద్దించాడు రాజు.



మంత్రి సమాధానం చెప్పలేక మౌనం వహించాడు.

''సరే, ఈ సమస్యను నేనే పరిష్కరిస్తాను. వానలు సకాలంలో కురిపించినవారికి, లేదా కురవడానికి ఉపాయం చెప్పినవారికి నూరు బంగారు నాణాలు బహుమతి ఇస్తామని రాజ్యమంతటా చాటింపు వేయించండి!'' అని ఆజ్ఞాపించాడు రాజు.

ఊరూరా చాటింపు వేయించారుకాని, ఏ ఒక్కరూ మేఘాలు వర్షించే మార్గం చెప్పలేకపోయారు.

రాజధాని శివార్లలోని గ్రామంలో ఉంటూన్న రాధూ అనే రైతుకు చిన్న పళ్ళతోట ఉన్నది. వానలు లేకపోయినప్పటికీ ఉన్న కొద్దిపాటి నీళ్ళతో అతడు తోటను జాగ్రత్తగా కాపాడుకుంటూవస్తున్నాడు.



ఒకనాడు రాధూ తన తోటలో గడ్డి కోస్తూండగా, ఒక చిలుకల జంట వచ్చి అయన పక్కన ఒత్తుగా ఉన్న పచ్చగడ్డి మీద వాలింది. చిలుకలు బాగా అలిసిపోయి, విచారంతో కనిపించాయి. రాధూ వాటికేసి జాలిగా చూశాడు. అప్పుడొక చిలుక, ''మిత్రమా! దప్పికగా ఉంది, మీ కొలనులో నీళ్ళు తాగడానికి అనుమతిస్తావా?'' అని అడిగింది.

''ఈ భాగ్యానికి నన్ను అడగాలా? కావలసినంత తాగి దప్పిక తీర్చుకోండి,'' అన్నాడు రైతు సంతోషంగా.

చిలుకలు వెళ్ళి, కొలనులో దాహం తీర్చుకుని, నేలబారుగా ఉన్న చెట్టుకొమ్మ మీద వాలి




కిశోర్‌కుమార్ సింగ్ మయూర్‌భంజ్

కూర్చున్నాయి.

"ఎంత దారుణమో చూడు! గొంతు తడుపు కోవడానికి గుక్కెడు నీళ్ళ కోసం కటకటలాడే కాలం దాపురించింది!" అని వాపోయింది ఒక చిలుక.

"ఇందులో వింతే ముంది? అడవులు నశించి పోయాయి. గ్రామ సమీపాలలోనూ, వృక్షాలూ, తోటలూ లేవు. అందువల్ల నేల, ఆకాశంలో వెళ్ళే మేఘాలను చల్లని గాలులతో ఆకర్షించలేక పోతున్నది. పైకి పీల్చుకునే వేళ్ళు లేవు గనక భూగర్భజలాలు కూడా మరీ లోతుకు వెళ్ళి పోయాయి," అన్నది రెండవ చిలుక.

"అలాగా!" అన్నది మొదటి చిలుక ఆశ్చ ర్యంగా.

"అవును మరి. మిగతా వాటిలాగా ఈ కొలను ఎందుకు ఎండిపోలేదో తెలుసా? ఈ రైతు కొలను చుట్టూ దట్టమైన తోటను చక్కగా పెంచుతున్నాడు గనక!" అన్నది రెండవ చిలుక.

"మరి రాజ్యమంతటా వానలు కురవా లంటే ఏం చెయ్యాలి?" అని అడిగింది మొదటి చిలుక.

"అంటే, ప్రజలు మొదట చెట్లు నరకడం మానాలి. ఆ తరవాత మొక్కలు నాటి పెంచాలి. అది తప్ప వానలు కురిపించడానికి వేరొక మార్గం లేదు," అన్నది మళ్ళీ రెండవ చిలుక.

"నువ్వన్నది నిజం!" అన్నది మొదటి చిలుక.

ఆ తరవాత చిలుకలు రెండూ రైతుకు కృతజ్ఞతలు చెప్పి, అక్కడి నుంచి రివ్వున ఎగిరి పోయాయి.

ఆ మాటలు విన్న రైతు రాధూ అప్పటి కప్పుడే బయలుదేరి వెళ్ళి రాజును దర్శించి చిలుకలమధ్య జరిగిన సంభాషణ గురించి చెప్పాడు. రాజు పరమానందం చెందాడు. రాధూకు వంద బంగారు నాణాలు బహుమతి



ఇచ్చాడు. రాజ్యంలో చెట్లు నరకడం నిషేధిం చాడు. రాజ్యంలో ప్రతి ఒక్కరూ ప్రతిరోజూ ఒక్కొక్క మొక్కను నాటి పెంచాలని ప్రకటిం చాడు. తన ఆజ్ఞను అతిక్రమించిన వారిని కఠినంగా శిక్షిస్తానని హెచ్చ రించాడు.

రాజుగారి ప్రకటన తమ మంచికే అని ప్రజలు కూడా గ్రహించారు. రాజాజ్ఞను శిరసా వహించారు. మొక్కలు నాటి పెంచసాగారు. త్వరలోనే పరిస్థితులు మారాయి. ఋతు పవనం సకాలంలో కావలసినంత వానలు కురిపించింది. పచ్చని పంటలతో, చెట్టు చేమ లతో రాజ్యం సుభిక్షమయింది. ప్రజల ఆకలి బాధ తీరిపోయింది. అందరూ సుఖశాంతులతో జీవించారు.





# చెడు సహవాసం!




పి.కవిత
మదురై

పన్నెండవ తరగతి చదువుతూన్న అజయుడూ, విజయుడూ స్నేహితులు. ఒకే వీధిలో ఉంటూ న్నవారు గనక, ఇద్దరూ కలిసే పాఠశాలకు నడిచి వెళ్ళేవారు. ఇద్దరివీ పేద కుటుంబాలు. తమ పిల్లలు బాగా చదివి మంచి ఉద్యోగాలు సంపాయించి తమను ఆదుకోగలరని వారి తల్లిదండ్రులు కొండంత ఆశతో ఉన్నారు.

ఇద్దరూ స్నేహితులే తప్ప, వాళ్ళ మనస్తత్వాలు మాత్రం పరస్పర విరుద్ధంగా ఉండేవి. అజయుడు నెమ్మదస్థుడు; ప్రతిదానినీ ముందు





వెనకలు ఆలోచించి చేసేవాడు. విజయుడు లేని దానికి అర్రులు సాచేవాడు. ఇంట్లో ఇడ్లీలు చేస్తే, దోసెలు కావాలనేవాడు. దోసెలుచేస్తే, పూరీలు కావాలనేవాడు. పూరీలు చేస్తే, పొంగల్ అడిగేవాడు.

ఒకరోజు పాఠశాలకు వెళుతూ విజయుడు మిత్రుడితో, "అజయ్! మనం ఆటోలో స్కూలుకు వెళదామా?" అన్నాడు.

"స్కూలుకు దగ్గర్లోనే కదా మన ఇళ్ళున్నాయి? ఆటో అవసరమేమిటి?" అని అడిగాడు అజయుడు.

"ఆటోలో వెళ్ళి దిగితే మన తోటి విద్యార్థులు మనల్ని గొప్పగా చూస్తారు కదా?" అన్నాడు విజయుడు.

"మన తల్లిదండ్రులు ఆటోకు ఖర్చు పెట్టగల స్థితిలో ఉన్నారా? దాన్ని కాస్త ఆలోచించి చూడు," అన్నాడు అజయుడు.

అయినా మిత్రుడిమాటలేవీ విజయుడి చెవికెక్కలేదు. తల్లిదండ్రులకు ఎలాగో నచ్చజెప్పి, తనుకూడా ఇతర మిత్రులతో కలిసి ఆటోలో వెళ్ళడం ప్రారంభించాడు.

అలా ఆటోలో విజయుడితో కలిసి వెళ్ళే వాళ్ళు, మంచివాళ్ళు కాదని గ్రహించిన అజయుడు ఒకనాడు, భోజన సమయంలో, "విజయ్, వాళ్ళు రౌడీల్లా ప్రవర్తిస్తూంటారు. వాళ్ళతో స్నేహం చెయ్యొద్దు," అన్నాడు.

"వాళ్ళేమో మంచివాళ్ళే. నువ్వే అసూయ కొద్దీ వాళ్ళమీద అవాకులు చవాకులు చెబుతున్నావు," అన్నాడు విజయుడు.

"లేదు. వాళ్ళకు చాలా దురలవాట్లున్నాయి. దయచేసి వాళ్ళకు దూరంగా ఉండు. అది నీకే మంచిది," అని హెచ్చరించాడు అజయుడు.

"నా మంచేదో, చెడేదో నాకు తెలుసు. నీ ఉపదేశాలు నాకొద్దు. నీ పని నువ్వు చూసుకో," అన్నాడు విజయుడు దురుసుగా.






కిశోర్‌కుమార్
సింగ్,
మయూర్‌భంజ్

ఆ తరవాత వాడు అజయుడికి పూర్తిగా దూరమై కొత్త మిత్రులతో కలిసిపోయాడు.

"విజయ్, రాత్రికి చిన్న వినోదం వుంది. తప్పక రావాలి," అన్నాడు కొత్త మిత్రుడు.

"సరే, అలాగే," అన్నాడు విజయుడు. కొత్తమిత్రులతో రహస్యంగా విందు వేడుకలకు వెళ్ళడం, వాళ్ళతో కలిసి అప్పుడప్పుడు మాదకద్రవ్యాలు పుచ్చుకోవడం విజయుడికి అలవాటైపోయింది.

కన్నవాళ్ళకు సైతం దూరంగా ఉంటూ, చదువుల గురించి అడిగినప్పుడు బాగా చదువుతున్నానని అబద్ధం చెప్పేవాడు.

కొద్దిరోజుల్లోనే మిత్రులతో కలిసి గుంపుగా బస్సుల్లో జొరబడడం, గొడవచేయడం, పరిహసించడం, జేబులు కత్తిరించడం అలవాటయింది.

ఒకరోజు విజయుడూ, వాడి మిత్రులూ స్కూలు సమీపంలో ఉన్న బస్‌స్టాపులో నిలుచున్నారు. బస్సు రాగానే గుంపుగా అందులోకి ఎక్కి, చేతిలో సంచీతో ఉన్న ఒకవృద్ధురాలి చుట్టూ మూగారు. వీళ్ళేం చేయగలరో ఊహించిన వృద్ధురాలు భయపడి వాళ్ళబారి నుంచి తప్పించుకోవడానికి, హడావుడిగా బస్సు దిగబోయి, కాలు జారి కింద పడిపోయింది.

విజయుడూ, అతడి మిత్రులూ బస్సు దిగి పారిపోవడానికి ప్రయత్నించారు. కాని, సహప్రయాణీకులు వాళ్ళను తరిమి పట్టుకున్నారు. దేహశుద్ధి చేసి పోలీసులకు అప్పగించారు.

సంగతి తెలిసిన విజయుడి తల్లిదండ్రులు, నెత్తీ నోరూ మొత్తుకుంటూ వెళ్ళి, పోలీసులకు క్షమాపణలు చెప్పుకుని వాణ్ణి విడిపించుకుని వచ్చారు.

అజయుడికి విషయంతెలిసి,పాతమిత్రుణ్ణి పరామర్శించడానికి వెళ్ళాడు. వాణ్ణిచూడగానే విజయుడు కన్నీళ్ళు కారుస్తూ, "నీ మాట వినకుండా ఇలా పాడైపోయాను. నా చెడుసహవాసాల వల్ల నా తల్లిదండ్రులు అవమానం పాలయ్యారు. నన్ను కన్నందుకు సిగ్గుపడుతున్నారు," అన్నాడు పట్టరాని వేదనతో.

అజయుడు, "మిత్రమా! ఇప్పుడైనా నీ పొరబాటు గ్రహించావు. అదే చాలు. తప్పును సరిదిద్దుకుని మంచిమార్గంలో పయనిస్తే, బాగా చదువుకుని మునుముందు ఎంతో సాధించవచ్చు. నువ్వూ బాగుపడి, పదిమందికీ ఉపయోగపడవచ్చు. విచారించకు. నీ తల్లిదండ్రులతో నేను మాట్లాడతాను," అని





విజయుడి వెన్ను చరిచి ఓదార్చాడు.

విజయుడు మిత్రుడి మాటల్లోని సత్యాన్ని గ్రహించాడు. చేసిన తప్పుకు పశ్చాత్తాపపడ్డాడు. లేనిపోని ఆశల జోలికి పోకుండా మంచి అలవాట్లతో చదువులపై శ్రద్ధవహించి, తల్లిదండ్రుల ప్రేమకు పాత్రుడయ్యాడు.





# త్రుటిలో తప్పిన అపాయం




అరుంధతి
సర్కార్
కొల్‌కత

"పోంగో! ఇంతలో ఎంతపని చేశావు? నా ప్రయోగాన్నంతా నాశనం చేసేశావే! అల్లరి కుక్కపిల్లా! వెళ్ళూ ఇక్కణ్ణించి!" అని అరిచింది రియా. కుక్కపిల్ల తోక ముడిచి వెలుపలికి నడిచింది. రియా మేజా దగ్గరికి వెళ్ళి, "అహా! నా శ్రమ అంతా అటు వెళ్ళి వచ్చే లోగా ఇలా నేలపాలైపోయిందే! ఇప్పుడేం చేయడం? అంతా ఆ కుక్కపిల్ల చేసిన పని. ఎంత పెద్ద తప్పు చేసిందో దానికి తెలియదు!" అనుకుంటూ కళ్ళనీళ్ళ పర్యంతమైపోయింది రియా.



రియా ఉద్వేగపూరితమైన ప్రయోగం మధ్యలో ఉంది. దోమలు, ఈగలు, ఇతర కీటకాలను తరమడానికి ఏవేవో రసాయనిక పదార్థాల మిశ్రమాలను తయారుచేస్తోంది. ఇంట్లో తను చదువుకునే గదినే ప్రయోగ శాలగా మార్చుకున్నది. లోపలికి ఎవరినీ రానిచ్చేది కాదు. అయితే రియాతోపాటు అన్నయ్య రిచూ, వాళ్ళింట్లో ఉన్న కుక్కపిల్ల పోంగో ఆమె చేసే ప్రయోగాలను చెడగొట్ట డంలో తెగ మురిసిపోతున్నారు.

రియాకు విజ్ఞానశాస్త్రం అంటే చాలా అభి మానం. ప్రయోగాలు చేయడం అంటే మహా ఇష్టం. ముఖ్యంగా విద్యుత్తు, వాహకాల పట్ల అమిత ఆసక్తి కనబరచేది.

ఆమె పుట్టినరోజుకు మిత్రులందరినీ పిలిచింది. అది మంచి వర్షాకాలం. రియా స్నేహి తులతో కలిసి సంతో షంగా ఇల్లంతా తిరుగుతూ సరదాగా మాట్లాడు తూంటే – ఆమె తల్లి టీవీ సీరియల్ చూస్తూ కూర్చున్నది. ఆ తరవాత పిల్లలు కార్టూన్ సినిమాల గురించి మాట్లాడు కున్నారు. పుట్టినరోజు కేక్ కట్ చేశాక అందరూ కేక్ తిని శీతలపానీయాలు తాగారు. ఆ తరవాత ఆటపాటల్లో దిగారు. పోంగో ఉత్సాహంగా వాళ్ళ వెంట తిరుగుతోంది.



పుట్టినరోజు వేడుక జరుగుతూండగా వాళ్ళ కళ్ళముందు పెద్ద మెరుపు మెరిసింది.

"అహా! మెరుస్తున్నది. మబ్బులు దట్టంగా ఉన్నాయి. వర్షం రాబోతోంది." అన్నది రిమా బిగ్గరగా.

"అవును, పెద్ద వర్షం రాబోతోంది," అన్నది రియా.




కె.శ్రీరామ్
రాజమండ్రి

వాళ్ళనుకున్నట్టే కొద్ది నిమిషాలలో వర్షం ఆరంభ మయింది.

''నేను ఎలా ఇంటికి వెళ్ళను?'' అన్నది అమృత.

''కాస్త పెద్దవాన కురిస్తే చాలు. రోడ్లన్నీ జలమయ మైపోతాయి!'' అన్నది రియా విచారంగా.



''అమ్మా! అమ్మా! వెంటనే టీవీని ఆఫ్ చెయ్. వాన కురిసేప్పుడు టీవీ చూడడం చాలా అపాయం,'' అని తల్లిని హెచ్చరించింది రియా.

అయితే రియా తల్లి ఆమె హెచ్చరికను ఏమాత్రం పట్టించుకోలేదు. కొంతసేపటికి ఫెళఫెళమంటూ పిడుగు పడే శబ్దం వినిపించింది. రియా, ''అమ్మా, కేబుల్ కనెక్షన్‌ను తీసెయ్. లేకుంటే పెద్ద ప్రమాదం జరగొచ్చు!'' అని అరిచింది మళ్ళీ.

మరుక్షణమే భయంకరమైన కేక వినిపించింది. పిల్లలందరూ రియా తల్లి ఉన్న హాల్లోకి వచ్చారు. అక్కడి దృశ్యం చూసి దిగ్భ్రాంతి చెందారు. రియా తల్లి టీవీ ప్లగ్‌కు అతుక్కుపోయి, కదలా మెదలక ఉంది. ఉరుముతున్నప్పుడు ప్లగ్ కనెక్షన్ విడదీయడానికి ప్రయత్నించి, విద్యుద్ఘాతానికి గురైంది!



''నాన్నా! తాక్కండి, తాక్కండి!'' అని అరిచింది రియా, తన తండ్రి తల్లి అరుపు విని భయపడి ఆమెదగ్గరికి వెళుతూండడం చూసి. రియా ఒక్క గెంతున వెళ్ళి పొడవాటి కర్రను తెచ్చి, తల్లి చేయిమీద బలంగా కొట్టింది. ప్లగ్ నుంచి ఆమె చేయి ఊడి రావడంతో ఆమె సొమ్మసిల్లి పడిపోయింది. రిజా పరిగెత్తిపోయి పక్కనే ఉన్న ఎలక్ట్రీషియన్ నాబాను పిలుచుకుని వచ్చింది.

తల్లిని మెల్లగా పడకగదిలోకి తీసుకు వెళ్ళి పడుకోబెట్టారు. కొంతసేపటికి తాగడానికి నీళ్ళిచ్చారు. ఆమె కళ్ళు తెరిచి లేచి కూర్చున్నది.



నాబా ప్లగ్ కనెక్షన్‌ను తొలగించాడు. ఆ తరవాత అతడు, ''రియా! చాలా మంచిపని చేశావు. సమయస్ఫూర్తితో పెద్ద అపాయం జరక్కుండా కాపాడావు. నువ్వు అలా జాగ్రత్త పడకుండా ఉన్నట్టయితే, మీ తల్లికి ప్రాణాపాయం కూడా వాటిల్లి ఉండేది!'' అన్నాడు.

''ఉరుములూ,మెరుపులూ టీవీని పాడు చేస్తాయనీ, టివీని చూసేవారికి అపాయం కలిగిస్తాయనీ నాకు తెలుసు,'' అన్నది రియా.

''అవును, నిజం!'' అన్నాడు నాబా.

రియా సైన్సు పరిజ్ఞానాన్ని అందరూ మెచ్చుకుంటూ చప్పట్లు కొట్టారు!





# మోసపోయిన మోసగాడు





వి.అపర్ణ
సికిందరాబాద్

కుమారపాలెం గ్రామంలో భూషయ్య ధనికుడైన భూస్వామి. కష్టాలలో ఉన్నవారికి సాయం చేసినట్టు నటించి ఆ తరవాతవారికున్న కొద్దిపాటి ఆస్తిపాస్తులనూ, భూములనూ వశపరచుకునేవాడు. గ్రామస్థులు ఎక్కువ మంది చదువురానివారు గనక, భూస్వామి ధనబలం ముందు వారిమాట చెల్లేదికాదు.

ఇలా ఉండగా, ఒకనాడు దూరప్రాంతం నుంచి చంద్రయ్య అనే యువకుడు ఆ గ్రామానికి వచ్చాడు. వ్యవసాయం చేయడానికి తగిన భూమి లభిస్తే, ఆ గ్రామంలోనే స్థిరపడాలనే ఉద్దేశంతో అతడు భూస్వామి భూషయ్య దగ్గరికి వెళ్ళి సంగతి చెప్పాడు.



మనిషిని చూస్తే వెర్రిబాగులవాడిలా ఉన్నాడు. అయినా చేత డబ్బు ఉన్నట్టున్నది.ఎందుకువదులుకోవాలి? ఊరికి ఉత్తరంగా ఉన్న పనికిరాని పర్రను వీడికి అంటగడతాను,అని భూషయ్య ఆలోచించి, "బంగారంలాంటి భూమి ఉంది. కష్టపడితే నవరత్నాలు పండించుకోవచ్చు," అన్నాడు.



చంద్రయ్య ఆయన అడిగినంత డబ్బు చెల్లించి, భూమిని కొనుక్కున్నాడు. మరునాడే పనులు ప్రారంభించాలని పొలం దగ్గరికి వెళ్ళాడు. కాని నేలంతా రాయి రప్పలు. ఎంత కష్టపడ్డా అక్కడ మొక్క మొలుస్తుందనే నమ్మకం ఏమాత్రం లేదు.



చంద్రయ్య అక్కడి నుంచి భూస్వామి దగ్గరికి వెళ్ళి, "అయ్యా! మీరు అడిగినంత డబ్బు ఇచ్చాను కదా? ఎందుకూ పనికిరాని నేలను నాకు అంటగట్టారేమిటి? ఇది పచ్చి మోసం! నా డబ్బు నాకు తిరిగి ఇవ్వండి," అన్నాడు.

ఆ మాటకు భూస్వామి, "చంద్రయ్యా, మాటలు కాస్త జాగ్రత్తగా రానీ. భూమి కొనేవాడివి చూసికదా కొనాలి. నాకు సొంతంగా ఎక్కడ చూసినా పొలం ఉంది. మంచిదే అనుకుని ఇచ్చాను. నన్ను తప్పుపడతావేమిటి?" అన్నాడు కోపంగా.

"మరి, నేనిచ్చిన డబ్బు నాకు తిరిగి ఇవ్వు. నీ పొలం నువ్వుపుచ్చుకో," అన్నాడు చంద్రయ్య.

"అదేం సాధ్యపడదు. పొలం వెళ్ళి కష్టపడుకో. అదే నీకు తప్పక తిండి పెడుతుంది," అన్నాడు భూస్వామి.

చంద్రయ్య మరేమీ మాట్లాడలేక మౌనంగా ఆలోచిస్తూతిరిగి వచ్చేశాడు.

మామూలుగా ప్రతి నెలా మొదటి మంగళ వారంనాడు, భూస్వామికి తన పొలాలన్నిటినీ తిరిగి చూడడం అలవాటు. దానిని గమనించాడు చంద్రయ్య.

ఆ నెల మొదటి మంగళవారం నాడు తెల్లవారగానే, చంద్రయ్య పారా, పలుగూ తీసుకుని పొలానికి వెళ్ళి వంచిన నడుం ఎత్తకుండా కష్టపడుతున్నట్టు నటించసాగాడు. ఆ సమయంలో అటువైపు వచ్చిన భూస్వామి దానిని చూసి, "ఏముందక్కడ?


బైశాఖి పాల్
నార్త్
24 పరగణాస్

చంద్రయ్య అలా కష్టపడి పోతున్నాడేమిటి?'' అని ఆశ్చర్యపోయాడు.

ఆ తరవాత భూస్వామి కాశీయాత్రకు వెళ్ళాడు. ఆయనతిరిగి రావడానికి ఆరు నెలలయింది. భూస్వామి యాత్ర నుంచి మరి రెండు రోజులలో వస్తాడని తెలియగానే చంద్రయ్య పక్కనున్న పట్టణానికివెళ్ళి చెరుకు గడలను కొని తెచ్చి, తన పొలంలో గుంతలు తీసి నాటాడు. మరునాడు మిగిలిన చెరుకు గడలతో పొలం దగ్గరికి వెళ్ళిన చంద్రయ్య వాటిని పొలం గట్టున పడేశాడు. మరునాడు పొద్దున భూస్వామి అటు వస్తూండడం గమనించి, పొలంలోని చెరుకు గడలను నరికి గట్టు మీదికి చేరవేస్తున్నట్టు చంద్రయ్య నటించ సాగాడు.



గట్టుమీదా, పొలంలో ఉన్న చెరకు గడలను చూసిన భూషయ్యకు ఆశ్చర్యంతో నోట మాట రాలేదు.

చంద్రయ్య అతణ్ణి సమీపించి, ''అయ్యా, తమవద్ద నుంచి కొన్న పొలంలో నిజంగానే బంగారం పండుతోంది. తమ వాక్కు ఫలించింది. యేడాది పంట ఆరు నెలల్లో చేతికందింది. వద్దనకుండా దీనిని తీసుకోండి,'' అంటూ ఒక మోపు చెరుకును ఆయన ముందు ఉంచాడు.

భూస్వామి ఒక చెరుకుగడను తిని చూశాడు. చాలా తియ్యగా ఉంది. అంతే, అతడి పేరాశ పెరిగి పోయింది. వెంటనే తన పొలాన్ని వెనక్కు తీసుకోవాలను కున్నాడు.



''చంద్రయ్యా! నువ్విచ్చిన డబ్బు నీకిచ్చేస్తాను. నా పొలం నాకిచ్చెయ్,'' అన్నాడు భూస్వామి గంభీరంగా.

''అదెలా, బాబయ్యా? పడ్డ కష్టానికి ఇప్పుడే కదా ప్రతిఫలం కళ్ళజూస్తున్నాను,'' అన్నాడు చంద్రయ్య.

''కావాలంటే నువ్విచ్చిన మొత్తానికి రెండింతలు ఇస్తాను. నా పొలం నాకిచ్చెయ్,'' అన్నాడు భూస్వామి మళ్ళీ.

''ఆ పొలాన్నే నమ్ముకుని బతుకుతున్నవాణ్ణి. అంత సారవంతమైన బంగారంలాంటి పొలాన్ని వదులుకోమంటే ఎలా?'' అన్నాడు చంద్రయ్య.

''సరే నీకు కావలసింది పొలమేకదా. నాకున్న మాగాణిలో దీనికి సమంగా పొలం ఇస్తాను. రెండింతలు డబ్బిస్తాను. ఈ పొలం మాత్రం నాకు వదిలెయ్,'' అన్నాడు భూస్వామి.



''పెద్దలు. తమరు ఇంతగా అడుగుతున్నారు. కాదనగలనా? తమ ఇష్టాను సారమే చేయండి,'' అన్నాడు చంద్రయ్య.

భూస్వామి పొలం మార్పిడి చేసుకుని, తను ఇస్తానన్న రెండితల ధనమూ ఇచ్చేశాడు. భూస్వామికి చక్కని గుణపాఠం నేర్పానని చంద్రయ్య చాలా సంతోషించాడు.

కొన్నాళ్ళకు చంద్రయ్య చేసిన మోసం భూస్వామికి తెలిసి, ఆగ్రహం చెందాడు. అయినా, తానేస్వయంగా మోసపోయానని నెమ్మదిగా గ్రహించాడు. ఆ తరవాత ఇతరులను దోచుకోవడం మానివేశాడు.





# శశి సాహసాలు!





పి.కార్తికేయ
విజయవాడ

అందమైన కుందేలుపిల్ల శశి తన తల్లితో కలిసి ఒక బొరియలో నివసిస్తూండేది. దానికి ఒకనాడు సమీపంలో ఉన్న అడవికి వెళ్ళాలనిపించింది. ఆ మాట తల్లితో చెప్పింది. ''ఒంటరిగా అడవి లోకి వెళ్ళే సాహసం చెయ్యొద్దు. నువ్వు చాలా చిన్నదానివి. అక్కడి పెద్ద జంతువులు నిన్ను తినేస్తాయి. జాగ్రత్త!'' అని హెచ్చరించింది తల్లికుందేలు.

అయినా పిల్లకుందేలు వినిపించుకోలేదు. మరునాడు తెల్లవారగానే తల్లిలేని సమయం చూసి ఒంటరిగా అడవిలోకిగెంతుతూ వెళ్ళింది. ఉన్నట్టుండి దానికేదో వింతశబ్దం వినిపించింది.



శశి ఆగి శబ్దం వచ్చిన వైపుకు తిరిగింది. ఎలుగుబంటి ఒకటి తనకేసి రావడం చూసి హడలి పోయింది. అంతలో పైనుంచి ఎండుపుల్ల ఒకటి విరిగి తన పాదాలదగ్గర పడడంతో దానిని ఎత్తి బలంగా ఎలుగుబంటి మీదికి విసిరి, తిరిగి చూడ కుండా పరిగెత్తసాగింది.

అది ఒక పొదను సమీ పించి అలసట తీర్చుకోవడానికి కూర్చున్నది. కొంతసేపటికి తలను అటూ ఇటూ తిప్పి చూసింది. ఒక నక్క తనకేసి మెల్లగా రావడం గమనించి, అక్కడి నుంచి మళ్ళీ పరుగు లంకించుకున్నది.

కొంతదూరం వెళ్ళాక, ఒక చెట్టు నీడను చేరి, తలపైకెత్తి చూసింది. ఆ చెట్టు కొమ్మకు పెద్ద తేనెతుట్టె వేలాడుతూ కనిపించింది. కుందేలు పిల్ల ఉత్సాహంకొద్దీ చిన్న రాయిని తీసి తుట్టెకేసి విసిరి, అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

దెబ్బతిన్న తేనెటీగల గుంపు గుయ్‌మంటూ వచ్చి, అప్పుడే అక్కడికి వచ్చిన నక్కను చూసి, అదే రాయి విసిరి ఉంటుందని అనుకుని దాని మీదికి దాడిచేశాయి!







బైశాఖి పాల్
నార్త్
24 పరగణాస్



పరిగెత్తి పరిగెత్తి బాగా అలిసిపోయిన కుందేలు పిల్ల, ఒక పెద్దచెట్టు నీడలో కూర్చుని కొంతసేపటికి అలాగే నిద్రపోయింది. అది నిద్రలేచి చూస్తేఎదుట కొన్ని క్యారట్ ముక్కలు కనిపించాయి. ఆకలిగా ఉండడంతో వాటిని ఆవురా వురుమని తినేసింది. ఆ తరవాత తల వెనక్కు తిప్పి చూసింది. తనకేసే చూస్తూ ఒక ఏనుగు పిల్ల ఉండడం చూసి శశి బెదిరిపోయి, ఎలా తప్పించుకోవడమా అని ఆలోచించసాగింది. అప్పుడు ఏనుగుపిల్ల, "భయపడకు! నేను నీ స్నేహితుణ్ణి! నిన్ను మీ ఇల్లు చేరుస్తాను," అన్నది.

శశి సంతోషంగా ఏనుగుపిల్ల వీపుమీద ఎక్కి కూర్చున్నది. ఏనుగుపిల్ల శశి బొరియకేసి బయలుదేరింది. తన బిడ్డక్షేమంగా తిరిగి రావడంచూసి తల్లికుందేలు పరమానందం చెందింది. తల్లీపిల్లలు రెండూ ఏనుగుపిల్లకు కృతజ్ఞతలు చెప్పుకున్నాయి.

శశి తనకు అడవిలో ఎదురైన అనుభవాలను తల్లికి వివరించి, "అమ్మా, ఇకమీదట నీ మాట తప్పక వింటాను. నేను పెద్దదానయ్యేదాక ఒంటరిగా అడవి దరిదాపులకు వెళ్ళను," అన్నది. ఆ తరవాత తల్లి ఒడిలో హాయిగా నిద్రపోయింది.




## తల్లిని రక్షించిన తనయుడు!



మనపురాణాలలో కనిపించే అతి పిన్న వయసు వీరుడు భృగువు కుమారుడు చ్యవనుడు! భృగుమహర్షి భార్య పులోమ నిండు గర్భిణిగా ఆశ్రమంలో ఒంటరిగా ఉన్నప్పుడు, ఒక రాక్షసుడు ఆమెను అపహరించడానికి ప్రయత్నించాడు. తనను రక్షించమని ఆమె దీనంగా విలపించింది. అయినా రక్షించడానికి ఎవరూ రాలేదు. "నువ్వు ఎంత రోదించినా వినిపించుకోవడానికి చుట్టుపక్కల ఎవరూ లేరు. పైగా నన్ను ఎదుర్కొనే ధైర్యం ఎవడికుంటుంది?" అని రాక్షసుడు దిక్కులు పిక్కటిల్లేలా వికటాట్టహాసం చేశాడు.

ఆ క్షణమే కళ్ళు మిరమిట్లుకొలిపే మెరుపు మెరిసినట్టయింది. రాక్షసుడు చూడలేక కళ్ళు మూసుకున్నాడు. కళ్ళు తెరిచి చూడగానే ఎదురుగా అమిత తేజస్సుతో చిన్న శిశువు కనిపించాడు. తల్లిని రక్షించడానికి ఆమె గర్భం నుంచి వెలుపలికి వచ్చిన చ్యవనుడు అతడే. శిశువు తీక్షణమైన చూపులకే సగం చచ్చిన రాక్షసుడు, ఒక్క దెబ్బతో నేలకొరిగి ప్రాణాలు విడిచాడు.





# అంతరిక్షంలో అపూర్వ అనుభవం!



పి.కార్తిక్
రామస్వామి
చెన్నయ్

అది ఒక ఆహ్లాదకరమైన ఉదయం. అంతా మామూలుగానే ఉంది. అయినా నాకు మాత్రం అది చాలా ప్రత్యేకమైన రోజు. ఎందుకంటారా? అంతరిక్షయానం కోసం నాసా స్పేస్ స్టేషన్‌కు కారులో వెళుతున్నాను కదా! కొంతసేపటికి నేనక్కడికి చేరుకున్నాను.



నేను మా బాబాయితో కలిసి వెళుతున్నాను. ఆయన అంతరిక్షగామి. అంతరిక్షం గురించీ, అంతరిక్ష నౌకలు అంటే స్పేస్‌షిప్స్ గురించీ, వాటిని నడపడం, నియంత్రించడం అంతా ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. 'స్పేస్ క్వీన్' అనే వ్యోమనౌకలోకి మేము వెళ్ళాము. నేను చుట్టూ ఎంతో ఆసక్తితో చూశాను. లోపల ఉన్న నియంత్రణ ఏర్పాట్లు నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించాయి.



మా బాబాయి అక్కడి అధికారులతో కొంత సేపు ఏదో చర్చించిన తరవాత, వాళ్ళు వెళ్ళిపోయారు. ఇప్పుడు మేము బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాం. కౌంట్ డౌన్ ఆరంభమయింది. నాలో ఉత్కంఠ పెరిగింది. ఉత్సాహానందాలు పెల్లుబికాయి. కౌంట్‌డౌన్ పూర్తయిన క్షణమే స్పేస్‌షిప్ అంతరిక్షం కేసి దూసుకుపోతోంది.

కొంతసేపటికి మేము భూమి ఆవరణను వదిలి దూరంగా వెళుతున్నాం. వ్యోమనౌక భద్రమైన అద్దాల గవాక్షాల గుండా సూర్య చంద్రులను చూడగలిగాము. అంతరిక్షంలో మెరిసే నక్షత్రాలు కూడా కనిపించాయి.

నేను నా చేతి గడియారాన్ని చూశాను. గ్రీన్‌విచ్ మీన్ టైమ్ ప్రకారం సాయంత్రం 6.30 గం. సమయం అమితవేగంగా గడిచి పోతోంది. బాబాయి వ్యోమనౌకనంతా చూపాడు. అత్యవసర పరిస్థితిలో నియంత్రణ పరికరాలను ఉపయోగించి వ్యోమనౌకను ఎలా నడపాలో కూడా నేర్పాడు.

నాకిప్పుడు ఆకలివేయసాగింది. భోజనం చేసి కొన్ని యేళ్ళయినట్టనిపించింది. మా బాబాయికీ అలాగే అనిపించింది. ఆయన ఒక పొట్లాన్ని విప్పాడు. వాటిలో చాలా శాండ్‌విచ్‌లు ఉన్నాయి. వెంటనే తినేశాం.

త్వరలో నిద్ర ముంచుకు వస్తున్నట్టనిపించింది. పడుకున్నాను. అయినా నిద్రపోలేకపోయాను. అంతరిక్షయానం చేస్తున్న ఉద్వేగం

నాలో ఉదిలాగుంది. అయినా బాబాయి మాత్రం నిద్రపోయాడు. రేపు ఏం చేయాలా అని ఆలోచించసాగాను. అలా ఆలోచిస్తూ నాకు తెలియకుండానే నిద్రలోకి జారుకునా ను.

మరునాడు తెల్లవారుజామున మేలుకునా ను. గడియారం చూశాను. సమయం 5.30 గం. బాబాయి ఎప్పుడో లేచి భూమి మీది స్టేషన్‌తో సంప్రదిస్తునా డు.

ఉదయం అల్పాహారం ముగించి కాస్సేపు మాట్లాడుకునా ం. అంతర్జాతీయ అంతరిక్ష గృహాని అంటే ఇంటర్‌నేషనల్ స్పేస్‌హౌస్‌ను (ఐ ఎస్ హెచ్) చేరుకోవడానికి ఇంకా ఆరు రోజులు పడుతుందని బాబాయి చెప్పాడు. అక్కడే మేము ఒక్క నెల గడపవలసి ఉంది!

ఐదు రోజులు గడిచాయి. ఆరవ రోజు వేకువజామున, బాబాయి మరో కొద్ది నిమిషాలలో ఐ ఎస్ హెచ్‌ను చేరుకోగలమని చెప్పాడు. నా మనసు ఉద్వేగంతో పరవళ్ళు తొక్కింది.

మేము ఐ ఎస్ హెచ్‌ని చేరుకున్నాం. దిగవలసినచోట వ్యోమనౌక దిగింది. మేము ఐ ఎస్ హెచ్‌లో ప్రవేశించాం. అది అచ్చం మన ఇల్లులాగా ఉండడం చూసి విస్మయం చెందాను. టీవీ, కంప్యూటర్, ఫర్నిచర్, సాధన సామగ్రి అన్నీ చక్కగా అమర్చబడి ఉన్నాయి!

బాబాయి ఆరు రోజులుగా స్వయంగా వ్యోమనౌకను నడుపుతున్నాడు కదా! బాగా అలిసిపోయాడు. పడుకుని నిద్రపోయాడు. నేను టీవీ చూస్తూ కూర్చున్నాను. ఉన్నట్టుండి బయటి నుంచి ఏదో వింత శబ్దం వినిపించింది. మొదట దానిని నేను పట్టించుకోలేదు. అయితే, అది మరింత ఎక్కువ కావడంతో స్పేస్ సూట్ ధరించి, అంతరిక్ష వస్తువులను సులభంగా గుర్తించడానికి వీలుగా ఉన్న స్పేస్ గ్లాసెస్‌ను పెట్టుకున్నాను. ఏం జరుగుతున్నదో చూద్దామని వెలుపలికి నడిచాను.



అక్కడున్నదాన్ని చూడగానే వెలుపలికి ఎందుకు వచ్చామా? అనిపించింది.

అదొక ఉల్క. అంతరిక్ష అంధకారంలో అది స్పష్టంగా కనిపిస్తోంది. అది నేనున్న ఐ ఎస్ హెచ్ కేసి వేగంగా వస్తున్నట్టు అనిపించింది. హడలిపోయాను. బాబాయిని తట్టి లేపి దాన్ని గురించి చెప్పాను.

మొదట ఆయన కూడా ఉద్రిక్తతకు లోనయ్యాడు. లేచి వేగంగా టెలిస్కోప్‌లా ఉన్న పరి



కరం దగ్గరికి వెళ్ళాడు. నేను చూపిన దిక్కు కేసి దాంతో కొన్ని క్షణాలు పరిశీలించి చూశాక చిన్నగా నవ్వాడు. నాకేమీ అంతుబట్టలేదు. ఎందుకలా నవ్వుతున్నాడు? ఉల్క ఐ ఎస్ హెచ్ కేసి వస్తున్నదా? రావడం లేదా?

"ఎందుకు నవ్వుతున్నావు?" అని అడిగాను. నిజానికి ఉల్క మా నుంచి దూరంగా వెళుతున్నట్టు చెప్పాడు. నన్ను కూడా పిలిచి ఆ టెలి స్కోప్‌లాంటి పరికరం గుండా





చూడమన్నాడు. చూశాను. అవును, అది దూరంగా వెళుతున్నది. ఊరటతో ఊపిరి పీల్చుకున్నాను.

మూడు వారాలు గడిచి పోయాయి. పెద్దగా ఏమీ జరగలేదు. అంతరిక్షగృహం నుంచి బయలు దేరేసమయం దగ్గరయింది. నాకేదో విచారం కలిగింది. అక్కడున్నవాటిని వదలలేక వదలలేక వదిలిపెట్టి తిరుగుప్రయాణమయ్యాను.

ఐ ఎస్ హెచ్ కనుచూపు నుంచి మరుగయింది. ఇద్దరికీ నిద్ర ముంచుకు రాసాగింది. ఆరురోజులు అంతరిక్షం లోనే గడిచిపోయాయి.



అంతరిక్షంలో ఆఖరి రోజున ఆలస్యంగా నిద్ర లేచాము. ఉదయం అల్పాహారం ముగించాం. ఉన్నట్టుండి వ్యోమనౌక వెనక భాగం నుంచిపొగరాసాగింది. ఏదో కాలుతూన్న వాసన వచ్చింది. వెంటనే వెళ్ళి చూశాము.



మా కళ్ళను మేమే నమ్మలేకపోయాము. ప్రధాన నియంత్రణా విభాగం కాలిపోతోంది. అది ఎలా జరిగిందో మాకు తెలియడం లేదు. చిన్న ఉల్క వ్యోమనౌకను తగలడంవల్ల మంటలు ఏర్పడ్డాయని భూమిస్టేషన్‌నుంచి సమాచారం అందింది. మంటలు వ్యోమనౌకను పూర్తిగా చుట్టుముట్టే అపాయం ఉందని హెచ్చరించింది.

మేము భయభ్రాంతులమయ్యాము. మామూలు వేగంతో భూమిని చేరుకోవడానికి ఇంకా రెండున్నర గంటలు పడుతుందని బాబాయి చెప్పాడు. ఆలోగా మంటలు మమ్మల్ని దహించివేస్తాయి కదా!



మంటలార్పే సాధనంతో మేము ఆ మంటను ఆర్పడానికి ప్రయత్నించాం. అయినా ప్రయోజనం లేకపోయింది. రకరకాల ప్రయత్నాలు చేశాం. కాని అంతకంతకూ మంటలు ఎక్కువవుతూనే ఉన్నాయి. వ్యోమనౌకను కొద్దికొద్దిగా హరించేస్తున్నాయి!

హఠాత్తుగా నాకొక ఆలోచన తట్టింది. బాబాయితో చెప్పాను. బ్రహ్మాండం అన్నాడు! వెంటనే అతడు నౌకను అత్యంత వేగంతో భూమికేసి నడిపించాడు.

భూమిని చేరడానికి ఇంకా అరగంట పడుతుంది. వ్యోమనౌక సగం కాలిపోయింది. నౌకలోపల వేడి భరించలేనంతగా ఉంది. అయినా, మేము అనుకున్న దానికన్నా ముందుగానే భూ ఆవరణలో ప్రవేశించాము. ప్యారాచూట్‌లు తగిలించు కుని వ్యోమనౌక నుంచి కిందికి దూకేశాం!

వ్యోమనౌక పూర్తిగా కాలి పసిఫిక్ సముద్రంలో పడి పోయింది. మేము ఆ లోపల ఎక్కడో దూరంగా ఆకాశంలో తేలుతున్నాం. చివరకు సిడ్నీలో దిగాం. మాకు ప్రథమచికిత్స అందించి, న్యూయార్క్‌కు చేర్చారు.

నాసా చేరుకోగానే మమ్మల్ని అక్కడి అధికారులు వచ్చి చూశారు. బాబాయి వారికి జరిగినదంతా చెప్పాడు. మంచి ఉపాయం చెప్పి ప్రాణాలు కాపాడుకున్నందుకు అధికారులు నన్ను అభినందించారు. నాకు సాహస బాలల పురస్కారం లభించింది.



# పాఠ్య పుస్తకంలో తన సొంత రచన!



కేరళ ప్రాంతానికి చెందిన తల్లిదండ్రులకు జన్మించిన పద మూడేళ్ళ మాథ్యు, రోమ్ నగరంలో చదువుకుంటున్న ఒక పాఠశాల విద్యార్థి. అతడి తండ్రి ఒక రెస్టారెంట్ నడుపు తున్నాడు. తల్లి ఆయుర్వేద వైద్యురాలు. ఆ కుర్రవాడు తన 7 వ తరగతి సివిక్స్ పాఠ్య పుస్తకంలో ఉన్న 'మాథ్యూ కథ' అనే పాఠాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే అది అతడు రచించిన అతడి కథే! నాలగవ తరగతి చదువు కుంటూన్నప్పుడు పిల్లల పత్రిక కోసం మాథ్యూ ఆ వ్యాసాన్ని ఇటాలియన్ భాషలో రాశాడు. ప్రభుత్వ విద్యాశాఖ దానిని 7 వ తరగతి పాఠ్యపుస్తకంలో చేర్చిందన్నమాట! మాథ్యూకు ఇంగ్లీష్, ఫ్రెంచి, లాటిన్, స్పానిష్ భాషలు తెలుసు. ఇప్పుడు గ్రీకుభాష నేర్చుకుంటున్నాడు. మాతృభాష అయిన మలయాళంలో మాట్లాడినప్పటికీ అతనికి చదవడం, రాయడం రాదు! అతనికి సుప్రసిద్ధులైన ఎందరో స్నేహి తులు ఉన్నారు. సుప్రసిద్ధ ఇటాలియన్ ఫుట్‌బాల్ క్రీడాకారుడు బాటిస్టుటా తరచూ మాథ్యూ తండ్రి నడుపుతూన్న డా. థామస్ రెస్టారెంటుకు వస్తూ ఉంటాడు.

# ఐ టి బాల మేధావి!




ఇంగ్లాండ్ మెయిడ్‌స్టోన్‌లో ఉంటూన్న గీతా తాణినాథన్ అనే ఆరేళ్ళ అమ్మాయి సెకండరీ స్కూల్ (ఉన్నతపాఠశాల) సర్టిఫికేట్‌కు సమాన మైన జి సి ఎస్ ఇ పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. ఆమె ప్రత్యేక పాఠ్యాంశం – ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ (సమాచార సాంకేతికవిద్య). ఆమె జి సి ఎస్ ఇ పరీక్షలకు కూర్చునే ముందు, వాట్‌ఫోర్డ్‌లోని ఒక కాలేజీలో తొమ్మిది నెలలపాటు ప్రతి శనివారం నాలుగు గంటలు తరగతులకు హాజరయింది. ఆమె రెండేళ్ళ పాపాయిగా ఉన్నప్పుడే కంప్యూ టర్‌పట్ల ఆసక్తి పెంచుకున్నదని తమిళనాడుకు చెందిన ఆమె తండ్రి, కందసామి చెబుతున్నాడు. ఇంట్లో ఉన్న కంప్యూటర్ ఉపయోగించడంలో నేనంటే నేను అని తండ్రీ కూతుళ్ళమధ్య తరచూ 'పోట్లాట' జరిగేదట!

# మనదేశం గురించి తెలుసుకుందాం

ఇద్దరు సుప్రసిద్ధ నాయకుల పుట్టినరోజులు నవంబర్‌లో వస్తున్నాయి. భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ 14వ తేదీన, తొలి మహిళాప్రధాని ఇందిరాగాంధీ 19 వ తేదీన జన్మించారు. ఆ నాయకుల వ్యక్తిత్వం, పాలన, అందించిన సేవలను ఈ నెల క్విజ్ ద్వారా స్మరించుకుందాం.

1. పండిట్ నెహ్రూ పిల్లల కోసం రాసిన పుస్తకం పేరేమిటి?
2. ''చాలా ఏళ్ళ క్రితం మనం భవిష్యత్తుతో సమావేశానికి ఒక ఒప్పందం కుదుర్చుకున్నాం. ఆ వాగ్దానాన్ని నెరవేర్చవలసిన సమయం ఇప్పుడు ఆసన్నమయింది.'' ఈ వాక్యం నెహ్రూ ఉపన్యాసం లోనిది. ఎప్పుడు, ఎక్కడ ఏ సందర్భంగా ఆ ఉపన్యాసం ఇచ్చారో తెలుసా?
3. నెహ్రూకు ఇద్దరు అక్కలు. వారిలో ఒకరు మనదేశంలో తొలి మహిళామంత్రి అయ్యారు. ఆమె ఎవరు? ఏ రాష్ట్రంలో మంత్రిపదవి చేపట్టారు?
4. మనదేశం స్వాతంత్ర్యం సాధించిన సమయంలో నెహ్రూ భారత జాతీయకాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉండేవారు. నిజమా? కాదా?
5. ఇందిరాగాంధి తన బాల్యంలో–స్వాతంత్ర్యోద్యమ నాయకులకు సాయమందించే బాల బాలికల జట్టుకు నాయకత్వం వహించింది. ఆ జట్టు పేరేమిటి? దాని ముఖ్యమైన కార్యక్రమం ఏది?
6. ఇందిరాగాంధీ 1971 లో అత్యధిక ప్రజాదరణ పొందారు. దానికి కారణం ఏమిటో తెలుసా?

(సమాధానాలు వచ్చే సంచికలో)

## అక్టోబర్ క్విజ్ సమాధానాలు

1. మైసూరు. పదిరోజుల ఉత్సవం బ్రహ్మాండమైన ఊరేగింపుతో సమాప్త మవుతుంది.
2. ఒరిస్సా రాష్ట్రం పూరీలో జరిగే రథ యాత్ర. బలభద్రుడూ, సుభద్ర సమేతంగా జగన్నాథ రథోత్సవం జరుగుతుంది.
3. జనవరిలో వచ్చే మకరసంక్రాంతి నాడు గుజరాత్‌లో గాలిపటాలుఎగురవేస్తారు. తమిళనాడులో పొంగళ్ళు పెడతారు.
4. ఈద్-ఉల్-జూహా.
5. ఖోర్దాద్ సల్.
6. మదురైలో జరిగే చైత్రోత్సవాలు. మీనాక్షీ సుందరేశ్వరుల వివాహం.
7. మైలాపూర్‌లో కపాలీశ్వర ఆలయం.
8. షింగో.



# విఘ్నేశ్వరుడు

ఒకానొకప్పుడు లక్ష్మి మానస సరోవరంలో జలకమాడుతూండగా, పార్వతి విష్ణువు వేషం ధరించి లక్ష్మిని సమీపించింది. సుమోహనంగా కనిపించిన నారాయణుని లక్ష్మి చూసింది. నారాయణుడి వేషంలో ఉన్న పార్వతికి కూడా లక్ష్మి అద్భుత సౌందర్యం అత్యంత మనోహరంగా కనిపించింది. ఇద్దరూ ఒకసారి సాభిప్రాయంగా చూసుకున్నారు. ఆ చూపుల కలయికలో సరోవరంలో ఒక స్వర్ణకమలం లేచింది. అందులో ధగధగ మెరిసిపోతున్న పసిపాప ఉన్నది.

లక్ష్మి, నారాయణుని దగ్గరచేరి ఆప్యాయంగా కౌగలించుకోబోయింది. పార్వతి పగలబడి నవ్వుతూ, 'నేను నారాయణుడిని కాను, లక్ష్మీ!'' అని ఆ క్షణమే నిజరూపంతో కనిపించింది.

లక్ష్మి, ''అన్నకు తగ్గ చెల్లెలివే, నారాయణి అనిపించుకున్నావులే!'' అన్నది చిన్నగా నవ్వుతూ.

పార్వతి, ''అప్పుడు విష్ణువు మోహినీ రూపంతో శివుణ్ణి మాయబుచ్చినదానికి ఇది చెల్లువేసుకో!'' అన్నది.

స్వర్ణకమలంలోని పసిదాన్ని చూసి ఇద్దరూ మురిసిపోయారు. అపార ప్రేమ పుట్టి చేతుల్లోకి తీసుకున్నారు. అప్పుడు విఘ్నేశ్వరుడు వచ్చి, ''తల్లులారా! మీ ఇద్దరి అంశలతో అవతరించిన ఈ బిడ్డ పార్వతి పరంగా జయ, లక్ష్మి పరంగా శ్రీ కలిసి జయశ్రీగా పెరుగుతుంది. ఆమెకు వరుడు కూడా శివకేశవుల అంశలతో అవతరించి ఉన్నాడు!'' అని చెప్పి, పసిదానితో ఉన్న స్వర్ణకమలాన్ని తీసుకువెళ్ళి కావేరీ నదిలో ఉంచి రమ్మని వాయుదేవుడికి చెప్పాడు.




హరిహరాంశలతో అవతరించిన స్వామి కైలాసం వెళ్ళి, విఘ్నేశ్వరుణ్ణీ, కుమారస్వామిని కలుసుకోవాలని ఎన్నాళ్ళుగానో అనుకుంటు న్నాడు. ఒకనాడు అలాగే బయలుదేరి కైలాసం వెళ్ళాడు స్వామి. విఘ్నేశ్వరుడు, కుమార స్వామి ఆనందంగా ముచ్చటలాడుతూ, మానససరోవరం జలవిహారం చేస్తూండగా, విఘ్నేశ్వరుడు, "ఈ మానససరోవరంలోనే లక్ష్మీపార్వతుల అద్భుత తేజస్సులతో స్వామికి కాబోయే దేవేరి ఉదయించింది!" అని ఊరు కున్నాడు.

స్వామికి కుతూహలం కలిగినా అణుచు కొని, మరి కొంతకాలం అక్కడ గడిపి, వెళ్ళ బోతున్నప్పుడు, విఘ్నేశ్వరుడు, "స్వామీ! మాకంటే పెద్దవాడివైన నీవు బ్రహ్మచారిగా ఉండటం బాగాలేదు. సత్వరంగా నీకు కళ్యా ణంతప్పదు!" అన్నాడు.

కుమారస్వామి, విఘ్నేశ్వరుడు స్వామికి ఘనంగా వీడ్కోలు ఇచ్చారు. స్వామి నిజ నివాసానికి చేరుకున్నాడు.

ఒకనాడు స్వామి వినోదంగా పెద్దపులి మీద స్వారీ చేస్తూ అరణ్యంలో తిరుగుతూండగా, పులిని ముందుకూ, అటు ఇటూ కదల నివ్వ కుండా చుట్టూరా బాణాలు రివ్వురివ్వున నాటుకున్నాయి. స్వామి బాణాలు వచ్చిన దిశగా కోపంగా చూశాడు. ఆయన కోపం పటా పంచలైంది. విల్లమ్ములతో ఠీవిగా నిల్చుని చిరునవ్వు విసిరిన జయశ్రీ కనిపించి, స్వామి గుండెలో బాణంలాగ గుచ్చుకున్నది. స్వామి అంతర్ధానమయ్యాడు.

జయశ్రీకి స్వామిని గురించి విఘ్నేశ్వరుడు కలలో కనిపించి అదివరకే చెప్పిఉన్నాడు.

వాయుదేవుడలాగే జయశ్రీని కావేరినదికి చేర్చాడు.

దక్షిణ ప్రాంతాన్ని పాలించే చక్రవర్తి స్వర్ణ కమలంలో కనిపించిన బాలికను, వరప్రసా దంగా లభించిన పుత్రికగా భావించి, పరమా నందంతో తీసుకువెళ్ళి, నామకరణ మహో త్సవం జరిపించుతూండగా, ఆకాశవాణి, "జయశ్రీ అని పిలవండి!" అని పలికింది. జయశ్రీ రాకుమారిగా పెరిగి ముల్లోకాల్లో అంత సౌందర్యవతి, సాహసవంతురాలు ఉండదనిపించుకున్నది.

జయశ్రీకి రాజభవనం కంటే ప్రకృతి సౌందర్యంతో నిండి ఉండే అరణ్యాల్లో విహ రించడమే ఇష్టంగా ఉండేది. ఎల్లప్పుడూ విల్లమ్ములు ధరించి, అరణ్య మధ్యానికి వెళ్ళి వన్యమృగాలను అదుపులో ఉంచుతూ తిరుగుతూండేది.

అతనికోసమే వెతుకుతూ అరణ్యాల్లో తిరుగు తున్నది.

నారదుడి ఆదేశంతో, చక్రవర్తి జయశ్రీకి స్వయంవరం ఏర్పాటు చేశాడు. రాజాధిరాజు లుగా మారురూపాలతో ఇంద్రాది దేవతలు కూడా వచ్చారు. స్వామి ఒక సాధారణ శబర యువకుడి రూపంతో విల్లమ్ములు ధరించి, పెద్ద నల్లని కుక్కను వెంటబెట్టుకొని వచ్చాడు.

రాజాధిరాజులు ఠీవి ఒలకబోస్తూ శబర యువకుణ్ణీ, అతని పెంపుడు కుక్కనూ ఎక సక్కెం చేశారు.

స్వామి సింహద్వారానికి అడ్డంగా, అందర్నీ కారాగారంలో బందీలు చేసినట్టు కుక్కమీద కూర్చున్నాడు. కుక్క పెద్దపులిగా మారింది. భయంకరంగా గాండ్రుమన్నది. జయశ్రీ స్వామిని గుర్తించి చరచరా వచ్చి వరమాల వేసి వరించింది. స్వామి జయశ్రీని పులిమీద ముందు కూర్చుండబెట్టుకున్నాడు. దేవతలకు కోపం వచ్చింది. శబరయువకుడి మీద ఒక్కుమ్మడిగా విరుచుకుపడి, ఆయు ధాలు తీశారు. స్వామి విల్లమ్ములు తీసి అందర్నీ ఎదుర్కొన్నాడు.

అతని బాణప్రయోగధాటికి దేవతలు చెల్లాచెదరై, నిజరూపాలతో అస్త్రాలు ప్రయో గించారు. స్వామిని ఎలాంటి అస్త్రమూ తాకలేక పోయింది. ఇంద్రుడి వజ్రాయుధం కూడా పనికిమాలినదైంది. అప్పుడు స్వామి తన నిజ రూపంతో హరిహరస్వామిగా సాక్షాత్కరిం చాడు. దేవతలు చేతులు మోడ్చారు, ''శరణం స్వామీ!'' అన్నారు.

స్వామి జయశ్రీల కళ్యాణం దేవాదిదేవ తలమధ్య మహావైభవంగా జరిగింది. జయశ్రీతో



కలిసి స్వామి ఆనందంగా నిజనివాసానికి వెళ్లాడు.

త్రేతాయుగంలో ఆర్యావర్తంలో కోసలుడు, కేకయుడు, వసుమిత్రుడు అనే రాజులు ముగ్గురూ ఆప్తమిత్రులుగా ఉండేవారు. కోసలుడికి కౌసల్య, కేకయుడికి కైకేయి, వసుమిత్రుడికి సుమిత్ర అనే కుమార్తెలు ఉన్నారు. అయోధ్యను పాలించే దశరథుడికి తమ కుమార్తెలను ఇచ్చి పెళ్ళి చేయాలని ముగ్గురు రాజులకూ ఏకాభిప్రాయం కలి గింది. దశరథుడు వారిని వివాహమాడడానికి అంగీకరించాడు.

ముగ్గురు రాజులూ జైమినిమహర్షి చేత వివాహానికి తగిన లగ్నం పెట్టించారు. జైమిని ముహూర్తం నిర్ణయించి, ''నేను పెట్టిన ముహూర్తబలం ఎటువంటిదంటే, విఘ్నే శ్వరుడి సాక్షిగా ఈ ముగ్గురి వివాహం దశరథు



డితో జరిగితీరుతుంది! అయితే, వివాహం జరిగే ముందు రాకుమార్తెలకు ఒక రాక్షస గండం కనిపిస్తున్నది. కనుక, వధువులు ముగ్గుర్నీ చాలా జాగ్రత్తగా ఉంచాలి!'' అని చెప్పాడు.

ముగ్గురు కన్యలనూ రాజులు ఒక పెద్ద పెట్టెలో భద్రంగా దాచారు.

ఆ సమయంలో లోకసంచారం చేస్తూ, లంకకు చేరిన నారదుడు రావణాసురుడితో, ''లంకేశ్వరా! అతి త్వరలోనే దశరథుడికి ముగ్గురు రాజకుమార్తెలతో వివాహం కాబో తున్నది. దశరథుడి కుమారుడు నిన్ను హతమారుస్తాడు!'' అని చెప్పాడు.

రావణుడు రాకుమార్తెలను ఎత్తుకు రమ్మని మహోదరుడు అనే గొప్ప రాక్షసుణ్ణి పంపాడు. మహోదరుడు కన్యలను పెట్టెలో భద్రపరిచినది కనిపెట్టి, ఆ పెట్టెను మ్రింగేశాడు. వాడు ఆకాశమార్గంగా సముద్రం మీదుగా లంకకు వెళ్తూండగా, కడుపు నొప్పి వచ్చి పెట్టెను కక్కేశాడు. సముద్రంలో పడి పెట్టె కెరటాలమీద మెల్లగా కొట్టుకుంటూ పోయింది.

దశరథుడు సముద్రం మీద దూరతీరాలకు వెళ్ళి పెద్ద నౌకలో తిరిగి వస్తున్నాడు. ప్రయాణం ఆలస్యమైంది. అనుకున్నానాటికి చేరలేకపోతున్నందుకు విచారిస్తూ, దశరథుడు సముద్రాన్ని చూస్తూండగా, నౌకవైపే కొట్టుకొని వస్తున్న పెద్ద పెట్టె కనిపించింది. పెట్టె నౌకను ఢీకొని పైకప్పు ఊడిపోయింది. అందులో రాకుమార్తెలు కనిపించారు. తాళ్ళ నిచ్చెనలతో వాళ్ళను నౌకమీదకు రప్పించాక, ఆ ముగ్గురూ తాను వివాహం చేసుకోనున్న పెండ్లికుమార్తెలే నని దశరథుడు తెలుసుకున్నాడు. సరిగ్గా అదే సమయానికి జైమినిమహర్షి ముహూర్తం పెట్టాడు. అప్పుడు అక్కడ విఘ్నేశ్వరుడు ప్రత్యక్షమై, ముగ్గురు రాకుమార్తెలతో దశరథుడి వివాహం జరిపించి, అంతర్థానమయ్యాడు. ముగ్గురు వధువులతో దశరథుడు ఆనందంగా స్వదేశం చేరుకున్నాడు.

చిరకాలానికి దశరథుడికి నలుగురు కుమారులు పుట్టారు. పెద్దవాడైన రాముడు కైకేయి కారణంగా సీతతో, లక్ష్మణుడితో అరణ్యవాసం వెళ్ళాడు. రావణుడు సీతను ఎత్తుకుపోయి లంకలో పెట్టాడు. రాముడు హనుమంతుడు, సుగ్రీవుడు మొదలైన వానరుల సహకారంతో లంకను ముట్టడించి, రావణ సంహారం చేశాడు. ఆ తరవాత సీతతో పుష్పక విమానంలో బయలుదేరి, వారధి కట్టడం ప్రారంభించిన సముద్రతీరంలో ఆగి,

అక్కడ శివపూజ జరిపి, అయోధ్యకు వెళ్ళా లనుకున్నాడు.

శివలింగ ప్రతిష్ఠకు తగిన లింగాన్ని తీసుకు రమ్మని హనుమంతుడిని కైలాసానికి పంపాడు. హనుమంతుడు మనోవేగంతో కైలాసం చేరు కొని, అక్కడ ఉన్న శివలింగాల్లో పెద్దలింగాన్ని చూసి రెండు చేతులతో ఎత్తబోయాడు. లింగం కొంచమైనా కదల్లేదు. దానికంటే చిన్న లింగాన్ని తీయబోయాడు. అదీ కదల్లేదు. చివరికి అన్నిటికంటే చిన్నలింగాన్ని కూడా ఎత్తలేకపోయాడు.

కాలం మించిపోతున్నది. తన అసమర్థ తకు హనుమంతుడు విచారిస్తుండగా, బుడి బుడి నడకలతో అక్కడికి ఒక పిల్లవాడు వచ్చాడు. ''ఎవరయ్యా నీవు? హనుమం తుడిలాగే ఉన్నావు, కాని కావు!'' అన్నాడు పిల్లవాడు.

''నేను హనుమంతుడినే! ఒక శివలిం గాన్ని తీసుకురమ్మని రాముడు పంపాడు. ఇంతకూ, నీవెవరవోయి, బాలుడా?'' అన్నాడు హనుమంతుడు.

'' ఇక్కడి లింగాలను ఎవరూ ఎత్తుకు పోకుండా నన్ను కపలా ఉంచారు గాని, నీవు హనుమంతుడవని చెబుతున్నావు, హను మంతుడు శివుడి అవతారమే అనీ, పంచ ముఖాంజనేయుడనీ విన్నాను. నీ పంచ ముఖాలు ఏవీ?'' అన్నాడు పిల్లవాడు అమాయకంగా.

అప్పుడు హనుమంతుడు గరుడ, వరాహ, సింహ, అశ్వముఖాలను కలుపుకొని, పంచ ముఖాంజనేయుడై, ఉన్నతంగా పెరిగి పిల్ల వాడితో నవ్వుతూ, ''విఘ్నేశ్వరా! నా వంతు అయింది. పంచముఖ విఘ్నేశ్వర రూపంతో కనిపించడం నీ వంతు!'' అన్నాడు.



అప్పుడు బాలుడి రూపంలో ఉన్న విఘ్నేశ్వరుడు, ఐదు తలలతో సమాన ఎత్తున పెరిగి విశ్వరూపంతో కనిపించాడు.

హనుమంతుడు పంచముఖ విఘ్నేశ్వరుడికి నమస్కరించి, "పిల్లవాడి రూపంతో వస్తున్నప్పుడే విఘ్నేశ్వరుడివని గ్రహించాను. ఇక్కడి శివలింగాలు కదలకుండా చేసింది నీవే కదా? నీవే ఒక లింగాన్ని ప్రసాదించు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "హనుమా! నీ పంచముఖ రూపం చూడాలన్న కుతూహలంతో నేను ఇలా చేశాను. నీవు శివాంశతో పుట్టినవాడవు, నీకు అడ్డేమిటి? అయినా అడిగావు గనక విశేషాంశలు గల లింగాన్ని నీకు ఇవ్వాలనే, ఎంచి ఉంచాను, తీసుకువెళ్ళు," అని చెబుతూ, హనుమంతుడి దోసిట్లో గొప్పదైన జ్యోతిర్లింగాన్ని ఉంచాడు.

హనుమంతుడు మామూలు రూపంతో దోసిట్లోని లింగాన్ని పదిలంగా పట్టుకొని, రివ్వున ఎగిరివెళ్ళాడు. అప్పటికి కాలాతిక్రమణ జరిగింది.

సమయం మించిపోకుండా సీతాదేవి ఇసుకతో శివలింగాన్ని చేసింది. రాముడు జలాభిషేకం చేసి, పూజకు ఉపక్రమించబోతూండగా, హనుమంతుడు లింగంతో అక్కడ వాలాడు.

హనుమంతుడు జరుగుతున్నది చూసి, తోకతో సైకతలింగాన్ని చుట్టి తీసివేయబోయాడు. కాని ఇసుకలింగం చెక్కుచెదరలేదు. హనుమంతుడు మరింత తోక గట్టిగా బిగించి లాగితే తోకనొప్పిపెట్టిందేగాని లింగం ఏమాత్రం కదల్లేదు.

అప్పుడు రాముడు హనుమంతుణ్ణి శాంతపరిచి, "హనుమా! బుద్ధిమంతులు కూడా ఒక్కొక్కప్పుడు పొరపాటు పడుతూంటారు సుమీ! అన్నీ తెలిసినవాడివి, సైకతలింగమైనా, అది శివునికి ఆనవాలు కదా? ఇంతకూ, ఇప్పుడేం మించిపోయిందిగనక. నీవు తెచ్చిన లింగాన్ని సైకతలింగం దాపునే ప్రతిష్ఠించి, పూజించి మరీ వెళతాను!" అని చెప్పాడు.

హనుమంతుడు తను తెచ్చిన లింగాన్ని రాముడికి ఇచ్చి, లెంపలు వేసుకొని సైకత లింగానికి మ్రొక్కాడు.

రాముడు హనుమంతుడు తెచ్చినలింగాన్ని ప్రతిష్ఠించి, యథావిధిగా పూజాక్రమం సీతతో కలిసి జరిపినపిమ్మట, అందరితో పుష్పకం మీద అయోధ్యకు చేరి, పట్టాభిషిక్తుడయ్యాడు.





# కళ్ళు తెరుచుకున్నాయి!

రాఘవాపురంలో నివసించే రాముడు, సోముడు అనే ఇద్దరన్నదమ్ముల మధ్య ఆస్తి గొడవలు వచ్చాయి. ఊరిపెద్దలు కొందరు రాముడి పక్షానా, మరికొందరు సోముడి పక్షానా మాట్లాడడం ప్రారంభించారు. ఈ ధోరణి అన్నదమ్ములిద్దరికీ తలనొప్పిగా తయారైంది. వాళ్ళకు ఊరిపెద్దల్లో ఎవరిపైనా నమ్మకం లేకుండా పోయింది.

ఈ పరిస్థితుల్లో ఏమిచేయడమా అని వాళ్ళు ఆలోచిస్తూండగా, కామయ్య అనే ఒక పశువుల వ్యాపారి రాఘవాపురం వచ్చాడు. ఆయన రాముడు, సోముడు మధ్య ఆస్తి పంపకం విషయంలో వచ్చిన తగాదా సంగతి తెలిసి వాళ్ళతో, ''నేను వ్యాపారం పనుల్లో చాలా ఊళ్ళు తిరిగాను. ఇక్కడికి ఆమడ దూరంలో వున్న నాగారంలోని ధర్మన్నఅనే పెద్దమనిషి గురించి విన్నాను. అయనధర్మంగా తీర్పులు ఇస్తాడని జనం చెప్పుకుంటున్నారు!'' అన్నాడు.

రాముడు, సోముడు నాగారం వెళ్ళి ధర్మయ్యను కలుసుకోవాలనుకున్నారు. వాళ్ళు ఒకనాటి ఉదయం బయలుదేరి మధ్యాన్నం వేళకు నాగారం చేరారు. అక్కడ వాళ్ళు గ్రామంలో ప్రవేశించి ఎదురుగా వస్తున్న ఒక రైతును, ''ఈ గ్రామంలో ధర్మన్న అనే పెద్ద మనిషి కోసం వచ్చాం. ఆయన ఇల్లెక్కడ?'' అని అడిగారు.

అందుకారైతు ఆశ్చర్యంగా, ''ఆ చెవిటాయన కోసం వచ్చారా, బావుంది! సరే, తిన్నగా వెళ్ళండి,'' అనేసి వెళ్ళిపోయాడు.

రైతు జవాబుకు అన్నదమ్ములిద్దరూ బిత్తరపోయి, మరికాస్త ముందుకు వెళ్ళి, వీధిపక్కన నిలబడివున్న ఒక ఆడమనిషిని, ధర్మన్న ఇంటి గురించి వాకబు చేశారు.

''ఎవరూ, ఆ గుడ్డి ధర్మన్నా? అదిగో, ఆ కనిపించే కొబ్బరితోట పక్కనుంచి నేరుగా వెళ్ళండి,'' అనేసి తిరిగిచూడకుండా వెళ్ళిపోయిందామె.

కోలపల్లి ఈశ్వర్



మరికాస్త ముందుకు వెళ్ళి కొబ్బరితోట దాటి, మరొక స్త్రీని ధర్మన్న ఇంటిగురించి అడిగారు అన్నదమ్ములు.

ఆమె వాళ్ళకేసి వింతగా చూస్తూ, "ఆ మూగధర్మన్నతో మీకేం పని? సరిసరి, వెళ్ళండి. అదిగో కనబడుతున్నదే ఆ అమ్మవారి గుడికి కుడిపక్కన కనిపించేదే, ఆయన ఇల్లు," అని వెళ్ళిపోయింది.

ఇంతవరకూ ధర్మన్నను గురించి విన్న అన్నదమ్ములు బిక్కచచ్చిపోయి, ధర్మన్న ఇంటి ముందుకు వెళ్ళి, "ధర్మన్నగారూ!" అని పిలిచారు.

"ఎవరూ?" అంటూ బయటికొచ్చాడొక వృద్ధుడు.

"ధర్మన్నకోసం వచ్చాం," అన్నారు అన్న దమ్ములు.

"నేనే నాయనా, ధర్మన్నని. ఎక్కడి నుంచి వస్తున్నారేంటి? సంగతేమిటో చెప్పండి," అంటూ ఇంటి అరుగుమీద కూర్చున్నాడు ధర్మన్న.

అన్నదమ్ములు విస్మయంగా చూశారా యనకేసి.

ముందుగా కాస్త కోలుకున్న రాముడు, "మాది రాఘవాపురం. అది అలా ఉంచండి. మిమ్మల్ని చూడడానికి వస్తూ ఉంటే అయ్యా, మీకు చెవుడని చెప్పాడొకరైతు!" అన్నాడు.

"అదా! మా ఊరి చెరువు పూడిక తీయించ మని రైతులు, నాకు చెబుతూ వస్తున్నారు. అది కుదరడం లేదు. అందుకే నాపై కోపంతో అలా అని వుంటాడు ఆ రైతు," అన్నాడు ధర్మన్న నవ్వుతూ.

"మరి మీరు గుడ్డివారని ఒకావిడన్నది!" అన్నాడు సోముడు.

"అదా! మా ఇంటి పై కప్పుపై పెంకులు ఎగిరిపోయి, గతంలో వర్షంజల్లు లోపల పడింది. ఇంటి పరిస్థితి చూసికూడా

ఫెంకులు కప్పించకుండా వూరుకున్నానని, మా ఆవిడే ఆ మాట అని వుంటుంది!'' అన్నాడు ధర్మన్న.

''అవన్నీ సరే! ఇది చాలా ఆశ్చర్యంగా వుంది. మీరు మూగవారని అన్నదొకావిడ,'' అన్నాడు రాముడు.

''అదా! ఊళ్ళో కొందరు మగవాళ్ళు భార్యలను వేధిస్తున్నారు. ఆ స్త్రీలంతా నా ఇంటికి వచ్చి, తమ భర్తలకు తగు బుద్ధి చెప్పమని కోరుతూంటారు. అయితే, నేను మాత్రం ఆ దురుసు వెధవల్ని, ఈ విషయమై నిలదీసి అడగలేకపోతున్నాను. అందుకే నన్ను మూగవాడని అని వుంటుంది, ఆ ఇల్లాలు,'' అన్నాడు ధర్మన్న.

ఆ మాటకు అన్నదమ్ములు, ''తమరేం అనుకోకండి మా ఊరు వచ్చిన పశువుల వ్యాపారి కామయ్య, ఎంతకూ ఒక కొలిక్కి రాని మా ఆస్తి గొడవల్లో మీరొక్కరే సరైన తీర్పు ఇవ్వగలరని మమ్మల్ని ఇక్కడికి పంపాడేమిటి?'' అని అడిగారు.

''నేను ఇచ్చే తీర్పులు ధర్మంగా ఉన్నా, స్వార్థం, అహంభావం, అజ్ఞానం కారణంగా కొందరికి కొన్ని తీర్పులు అధర్మంగా, కంటకంగా కనిపిస్తాయి. ఇప్పటి విషయాలే చూడండి. చెరువు పూడిక తీయడానికి ఇది సరైన సమయం కాదని నాకు తెలుసు. తీసినా పెద్ద ప్రయోజనం ఉండబోదు. అందువల్ల ఊరుకున్నాను. దానిని గ్రహించలేక రైతులు నన్ను చెవిటివాడంటున్నారు. ఇంటి పెంకులు ఇప్పుడు ఎండాకాలం గనక మార్చకపోయినా మునిగిపోయేదేం లేదు. దానిని భరించలేక నా భార్య నన్ను గుడ్డివాడంటున్నది. ఇక భార్యాభర్తలన్నాక చిల్లరమల్లర గొడవలు తప్పవు కదా? వాటిని సర్దుకుపోవడం చేతగాక భర్తను నేను మందలించలేదని ఆ ఇల్లాలు నన్ను మూగవాడంటున్నది. అయినా, ఇద్దరిమధ్య అభిప్రాయభేదాలు, గొడవలు వస్తే వాళ్ళల్లో వాళ్ళు సర్దుకుపోవాలేగాని, మూడోవ్యక్తి ప్రమేయంవల్ల పెద్దగా ఒరిగేదేమీ ఉండదు కదా?'' అన్నాడు ధర్మన్న చిన్నగా నవ్వుతూ.

ఆ వెంటనే అన్నదమ్ములిద్దరూ తలలు వంచి నమస్కరించి, ''ఇప్పుడు మా కళ్ళు తెరుచుకున్నాయి. మా ఆస్తి గొడవలను మేమే పరిష్కరించుకోవాలని మాకర్థ మైంది,'' అంటూ మెనుదిరిగి తమగ్రామం కేసి బయలుదేరారు.





# జమీందారు చెరువు!

కొండాపురం అనే గ్రామంలో, కాస్త పొలం పుట్రావున్న వ్యక్తొకడు అందరికీ తలలో నాలుకలా వుండేవాడు. ఎవరికే సహాయం కావలసివచ్చినా చేయడమేగాక, తనకున్న కలిమిలో బీదా బిక్కికి దానధర్మాలు చేసే వాడు. ''ఇలాంటి వాడికి గనక జమీందారీ వుంటే, చేతికి ఎముక లేకుండా దానం చేస్తాడు!''' అంటూ ఆ గ్రామ ప్రజలే కాకుండా చుట్టుపక్కల వారు కూడా ఎంత గానో మెచ్చుకునేవారు.

కాలక్రమేణా ఆ వ్యక్తి అసలు పేరు మరుగున పడిపోయి, ప్రజల మధ్య అతడి పేరు జమీందారుగా స్థిరపడిపోయింది. పైగా, అతడు ఒంటరివాడు; పెట్టి పోషించవలసిన దగ్గర బంధువులు తనకెవరూలేరు. కొండాపురం అచ్చెర్లకోట సంస్థానంలోని గ్రామం. అచ్చెర్లకోట జమీందారుకు, తనజమీగ్రామం లోనే ఒకడు జమీందారుగా పిలవబడుతున్నాడని విని, సంగతేమిటని దివానును పిలిచి అడిగాడు.

అందుకు దివాను, ''మహారాజా! ఒక వ్యక్తిని దేవుడని పిలిచినంతమాత్రాన అతడు దేవుడైపోడు. అలాగే, కొంచెం దానగుణం వున్నది గదా అని, అతణ్ణి ప్రజలు జమీందారుగా పిలిచినంతమాత్రాన తమ కీర్తికి ఏమాత్రం భంగంరాదు. వాకబుచేసి చూశాను. అతడికి తండ్రి తాతలనుంచి కొంచెం ఆస్తి సంక్రమించింది. బంధువులుపెద్దగాలేరు. ఇంకా పెళ్ళికాలేదు. జమీందారీతనం అనేది పుట్టుకతో రావాలి!వయసుపొంగు ఉద్రేకంలో చేస్తున్న, ఈ దానధర్మాలు, సంసారి కానంత వరకే. ఇటువంటి విషయాలు మనం అసలు పట్టించుకోకూడదు,'' అన్నాడు. ఆ మాటలకు జమీందారు నవ్వి వూరుకున్నాడు.

ఇలా వుండగా– కొండాపురం గ్రామాధికారి కాలం చేశాడు. కొత్త గ్రామాధికారిని

డా॥ జొన్నలగడ్డ మార్కండేయులు

నియమించాల్సివుంది. అందుచేత జమీం దారు దివానుతో, ''ఈ రోజునుంచి, నా సం స్థానంలో, నేనొక్కడినే జమీందారుగా పిలవ బడాలి. ఇదే మంచి అదను! చనిపోయిన గ్రామాధికారికి వారసులు లేరు. అందరికీ సహాయం చేస్తూ, మంచివాడుగా జమీం దారని పిలిపించుకుంటున్న ఆ వ్యక్తిని గ్రామా ధికారిగా నియమించండి. అందువల్ల, అతడినెవరూ ఇక జమీందారని పిలవరు. పైగా, మంచివాడూ, సమర్థుడూ గనక మనకు రావలసిన శిస్తులవీ చక్కగా వసూలు చేయించి, క్రమం తప్పకుండా ఖజానాకు జమచేయిస్తాడు,'' అన్నాడు.

దివాను అప్పటికప్పుడే బయలుదేరి కొండాపురం వెళ్ళి ఆ వ్యక్తిని గ్రామాధికారిగా నియమించాడు. ప్రజలు ఎంతగానో సంతో షించారు.

జమీందారు ఆజ్ఞప్రకారం గ్రామస్థులు, తాము జమీందారని పిలిచే వ్యక్తిని, తమకు గ్రామాధికారిగా అంగీకరించినా, అతణ్ణి గ్రామాధికారిగా కాక, ఇంకా జమీందారనే పిలుస్తున్నారని విన్నా, దివాను ఆ విషయాన్ని జమీందారుకు చెప్పకుండా వూరుకున్నాడు.

ఒక ఏడాది గడిచింది. శిస్తులు వసూలు చేసే సమయం వచ్చింది. కొండాపురంగ్రామాధి కారిఅయిన జమీందారు, ఇంకా కొన్ని శిస్తులు వసూలు కావలసినవున్నప్పటికీ, తానే ఆ సొమ్ము వేసేసి, మొత్తం ఎనిమిదివందల రూపా యలు గ్రామనౌకరు చేతికిచ్చి, ఖజానాలో జమ చెయ్యమని అచ్చెర్లకోట పంపించాడు.

కొండాపురం నుంచే కాక, ఇంకా అనేక గ్రామాలనుంచి శిస్తులు పట్టుకొని, కొండా



పురం నౌకరులాగే, చాలామంది రావడంతో ఖజానా అధికారి ఊపిరిసలపనంత పనిలో మునిగిపోయాడు. కొండాపురం గ్రామనౌకరు కొంచెం మొహమాటస్థుడు. చొరవగా అధి కారి ముందుకు వెళ్ళలేక తెచ్చిన సొమ్మును భద్రంగా దగ్గరవుంచుకుని దిక్కులు చూడ సాగాడు.

ఆ సమయంలో అటుగా వచ్చిన దివాను, అమాయకంగా, కంగారుగా అటూ ఇటూ పచార్లు చేస్తున్న గ్రామ నౌకరును పలకరించి, అతడు కొండాపురం నుంచి వచ్చాడని తెలుసు కుని, ''శిస్తు ఎంత తెచ్చావేమిటి?'' అని అడిగాడు.

''దొరా! ఎనిమిది వందలు తెచ్చాను,'' అన్నాడు గ్రామనౌకరు.

''అలాగా! మీ జమీందారు గ్రామాధి కారి ఘటికుడే. పాతాయన ఏనాడూ ఇంత



పెద్ద మొత్తాన్ని ఒకేసారి జమకట్టిన పాపాన పోలేదు. నువ్వు తెచ్చిన డబ్బు చూసి సరిగ్గా వున్నదీ లేనిదీ తేలేంతవరకూ రశీదు ఇవ్వరు. ఏమైనా, సమర్థవంతుడైన గ్రామాధికారి పంపిన నౌకరును గౌరవించి తీరాలి మరి!'' అంటూ దగ్గరుండి ఎనిమిదివందల రూపాయలు జమకట్టినట్టుగా రశీదు తెప్పించి ఇచ్చేశాడు.

అయితే ఇక్కడ దివాను, గ్రామనౌకరు ఖజానా అధికారికి డబ్బు చెల్లించేసి, రశీదు కోసం ఎదురు చూస్తున్నాడని పొరబాటు పడ్డాడు. ఇక, ఖజనాధికారి కూడా డబ్బు తీసుకున్నాననే అనుకుని, దివాను చెప్పిన మాటకు గౌరవం ఇచ్చి, డబ్బు జమ వేసుకున్నట్టుగా రశీదు ఇచ్చేశాడు. గ్రామ నౌకరు బిడియస్తుడు గనక, ఏమంటే ఏమొస్తుందో అని భయపడి రశీదూ, ఖజానాకు కట్టని డబ్బూ తిరిగి తీసుకువచ్చి, జమీందారు గ్రామాధికారికి ఇచ్చేశాడు.

జమీందారు గ్రామాధికారి రశీదును, ఎనిమిదివందల రూపాయలను జాగ్రత్తపెట్టాడు. ఒక రోజున ఆయన ఉదయం పొలం వెళ్ళి తిరిగి వస్తుంటే, తన గ్రామంలోని ఆడవాళ్ళు బిందెలతో ఎదురయ్యారు. వాళ్ళు గ్రామానికి అరకోసు దూరంలోవున్న కొండవాగు నుంచి మంచినీళ్ళుతెచ్చుకుంటున్నారు. అదిచూసి గ్రామాధికారి జమీందారు జాలిపడి, గ్రామం సమీపంలోనే చెరువు తవ్విస్తే బాగుండుననుకున్నాడు.

వెంటనే ఆయన మంచి నీరు ఎక్కడ పడుతుందో చెప్పగల నిపుణులను పిలిపించాడు. వాళ్ళు కొండాపురమంతా తిరిగి, జమీందారు గ్రామాధికారి పొలం ప్రాంతం చెరువు తవ్వడానికి అనుకూలమనీ, ఆ నేల చెరువు నీటిని

పరిశుభ్రంగా వుంచగలదనీ చెప్పారు. జమీందారు గ్రామాధికారి, తనకున్న పొలంలో ఒక ఎకరం నేల కేటాయించి, చెరువు తవ్వించే ప్రయత్నం చేశాడు. అందుకోసం, జమీందారుకు కట్టకుండా గ్రామనౌకరు తిరిగి తెచ్చిన ఎనిమిది వందలు ఖర్చుపెట్టాడు. చెరువు పూర్తయ్యాక, అందరూ దాన్ని జమీందారు చెరువు అని పిలవసాగారు. ఆ నీరు చాలా తియ్యగావుండి, త్వరలోనే చుట్టుపక్కల గ్రామాల్లో పేరు సంపాదించుకుంది. అయితే అందరి నోళ్ళలోనూ అది జమీందారు చెరువుగా నానుతూ అచ్చెర్లకోట జమీందారుకు తెలియవచ్చింది. జమీందారుపేరుమీద చెరువేమిటని, ఆయన చాలా ఆశ్చర్యపోయాడు.

జమీందారు, దివానును పిలిపించి, ఆరా తీశాడు. తీగలాగితే డొంక కదిలిందన్నట్టు, కొండాపురం నుంచి ఖజానాకు ఎనిమిది వందలు జమకాలేదన్న విషయం బయట పడింది. జమీందారు కోపంగా కొండాపురం వెళ్ళి, జమీందారు గ్రామాధికారిని నిలదీశాడు.

జమీందారు గ్రామాధికారి జరిగింది చెప్పి, జమీందారుకు రశీదు చూపించి, "ఇది ఏ విధంగా చూసినా జమీందారు చెరువు! స్థలం నాదే అయినా, తమరు కబ్జా చేస్తే, ఆ స్థలం హక్కు మీదే అవుతుంది. ఆ చెరువు తవ్వించిన ఖర్చు తమ ఖజానాదే. డబ్బు చెల్లించినట్టుగా రశీదు వుంది కాబట్టి, ఆ డబ్బును నేను చెరువు కోసమే ధైర్యం చేసి వినియోగించాను. మేమందరమూ జమీందారు సేవకులం. జమీందారు సేవకుడిగా నేను తవ్వించినప్పటికీ, ఇది జమీందారు చెరువని పిలవడంలో తప్పులేదు కాబట్టి, మాపై కోపగించుకోకండి!" అన్నాడు.

గ్రామస్థులు కూడా జమీందారుతో ఒక్కొక్కరుగా, "అయ్యా! ఈ జమీందారు చెరువు మా కెంతో సౌకర్యంగావుంది. మీరు మరింత శిస్తుపెంచినా మేం కట్టడానికి సిద్ధంగావున్నాం," అన్నారు.

జమీందారు కొంచెంసేపు మౌనంగా ఆలోచించి, గ్రామాధికారి జమీందారు కేసి తిరిగి, "జమీందారంటే ప్రజలలో కలిసిపోయి వాళ్ళకు మేలుచేయడమేనని, నీ ప్రవర్తన చెబుతున్నది. అందుచేత, నువ్విక గ్రామాధికారివికావు, కొండాపురం జమీందారువి! నిన్ను సాటి జమీందారుగా అంగీకరిస్తున్నాను," అన్నాడు.





# ధర్మబుద్ధి

ఒకప్పుడు కోసలదేశంలో సిద్ధిస్వామి అనే ఒక ధర్మదాత ఉండేవాడు. అతను తనకున్న దానిలో అన్నార్తులకు విధిగా భోజనం పెట్టిపంపేవాడు. అతని దాతృత్వం గురించి అందరూ చెప్పుకోవటం విని కోసలరాజు, "అలాటివాడికి సహాయం చెయ్యటం కూడా పుణ్యమే!" అనుకుని, సిద్ధిస్వామికి రోజూ తన ప్రాసాదం నుంచి సువారాలు పంపేవాడు.

సిద్ధిస్వామి భార్య హంసమతి అన్నివిధాలా భర్తకు తగిన భార్య. తమకు మిగలకపోయినా సరే, వచ్చినవారికి ఎన్నడూ లేదు అనేది కాదు. నిరతాన్నప్రదాతలుగా ఆ భార్యాభర్తలకు కోసలదేశమంతటా గొప్ప పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. రాజుగారు నిత్యమూ పంపే సువారాల సహాయంతో వారు నిరాటంకంగా అన్నదానం చేస్తూ వచ్చారు.

ఇలా ఉండగా ఒకసారి కోసలరాజు సపరివారంగా తీర్థయాత్రకని కాశీ వెళ్ళాడు. అందరూ గంగాస్నానం చేసి ఒడ్డుకు వస్తూ ఉండగా, కొందరు భటులు, "రాజుగారు వస్తున్నారు, తప్పుకోండి!" అని కేకలు పెడుతూ జనాన్ని పక్కకు నెట్టసాగారు. వాళ్ళు కోసల రాజును కూడా అలాగే నెట్టారు.

అది చూసిన కోసల రాజభటులకు పట్టరాని కోపంవచ్చి, "కోసలరాజంటే ఏమిటనుకుంటున్నారు? కాశీరాజుకు ఇంత పొగరా?" అని గట్టిగా అరిచారు.

ఈ మాటలు కాశీరాజుకు వినిపించాయి. ఆయన తన గుర్రాన్ని ఆపి, కోసలరాజుకు నమస్కరించి, "సిద్ధిస్వామి ఉండే దేశానికి మీరు ప్రభువులని తెలియక మా భటులు అపచారం చేశారు. క్షమించండి," అన్నాడు.

ఈ మాటలు వినగానే కోసలరాజు మనస్సు చివుక్కుమన్నది. "నేనిచ్చే సువారాలతో అన్నదానం చేసే సిద్ధిస్వామి నుంచి నాకు కీర్తి రావటమా?" అనుకుని, ఆయన కోసలకు తిరిగి వచ్చాడు. వస్తూనే ఆయనసిద్ధిస్వామికి నిత్యమూ పోయే సువారాలు ఆపుచేశాడు.

కాని సిద్ధిస్వామీ, అతని భార్యా సువారాలు రావటం లేదని చింతించక, ఎప్పటిలాగే అతిథి సత్కారాలు చేస్తున్నారు. సిద్ధిస్వామికి అపఖ్యాతి కలిగించాలన్న ఉద్దేశంతో కోసల రాజు అతని ఇంటికి రోజూ అధికసంఖ్యలో అతిథులను పంపసాగాడు.

సిద్ధిస్వామి తన ధర్మనిష్ఠ కొనసాగించటానికి తనకున్న ఆస్తిపాస్తులు క్రమంగా అమ్ముకోవలిసి వచ్చింది. ఆస్తి అంతా అయిపోయాక సిద్ధిస్వామి చందాలు వసూలు చెయ్యటానికి బయలుదేరాడు. ఆయన చేసే ధర్మంపట్ల ఆదరం ఉన్నవాళ్ళు ధన సహాయం చేశారు.

అయితే అదికూడా క్రమంగా క్షీణించింది. ఒకరోజు సిద్ధిస్వామికి అతికష్టం మీద కుంచెడు బియ్యం మాత్రం దొరికాయి. అప్పటికే ఇరవై మంది అతిథులు కనిపెట్టుకుని వున్నారు. సిద్ధిస్వామి దిగాలుపడ్డాడు. అప్పుడు హంస మతి, తన మంగళసూత్రం తీసి తన భర్తకిచ్చి, తాను పసుపుకొమ్ము మెడకు కట్టుకుని, "విచా రించకండి. పని పూర్తిచెయ్యండి," అన్నది. అతిథిసత్కారం నిర్విఘ్నంగా జరిగిపోయింది.

ఆ నాటితో సిద్ధిస్వామివద్ద చిల్లిగవ్వ లేకుండా పోయింది. ఇక చేసేదిలేక ఆయన తన భార్యతో సహా కాశీ పోదామని బయలుదేరాడు.

ఆ రాత్రి వారు దారిలో ఒక సత్రంలో బస చేశారు. అదే సత్రానికి ఎవరో ముగ్గురు యాత్రి కులు వచ్చి, మాటల సందర్భంలో, "ఈ కాలంలో యాత్రికులకు అన్నం పుట్టకుండా ఉన్నది. మేము కోసల దేశం పోయి, సిద్ధిస్వామిగారి ఆతిథ్యం పొందుదామని ఉవ్విళ్ళూరుతున్నాం. బాబూ, మీకు సిద్ధిస్వామి గారు తెలుసా?" అని అడిగారు.

ఈ మాటలు విని సిద్ధిస్వామీ, ఆయన భార్యా ఆశ్చర్యపోయారు.

"తెలుసు. ఆయన అక్కడే ఉన్నాడు. మీరు బయలుదేరి వెళ్ళండి," అన్నాడు సిద్ధిస్వామి వారితో.

ఆ ముగ్గురు యాత్రికులూ నిద్రపోయాక హంసమతి తన భర్తతో, "ఏమండీ, మనం ఇప్పుడే బయలుదేరి మన ఇంటికి పోయి, వీళ్ళు వచ్చేసరికి వీళ్ళకు భోజన సదుపాయాలు చెయ్యాలి. లేకపోతే మనకు అసత్యదోషం అంటుకుంటుంది," అన్నది.

"చిల్లిగవ్వ లేదే! ఇంట్లో పిడికెడు బియ్యం కూడా లేదు. వీళ్ళకు భోజనం ఎలా పెడతాం?" అన్నాడు సిద్ధిస్వామి.

"ఫరవాలేదు. మన ఇంట్లో ఒక రోలూ, రెండు రోకళ్ళూ ఇంకా మిగిలి ఉన్నాయి. అవి అమ్మేద్దాం," అన్నది హంసమతి.

ఇద్దరూ వెంటనే తిరుగుప్రయాణమై, తెల్ల వారేసరికి ఇల్లు చేరుకున్నారు. అమ్మటానికి రోలు కదిలించేసరికి, దాని కింద వాళ్ళ పూర్వులు ఏనాడో దాచి ఉంచిన ధనపు బిందెలు ఆశ్చర్యంగా బయటపడ్డాయి!

ఆ రోజు వాళ్ళు ఆ ముగ్గురు యాత్రికు లకేగాక, ఊళ్ళో అందరికీ గొప్ప సంతర్పణ చేశారు.

ఈ సంగతి కోసలరాజు దాకా వెళ్ళింది. తాను ఇవ్వకపోతే దేవుడే ఇవ్వవచ్చునని ఆయనకు తట్టలేదు. కాని ఇప్పుడదే జరిగే సరికి కోసలరాజు పశ్చాత్తాపపడి, ఎప్పటిలాగే సువారాలు పంపటం ప్రారంభించాడు.





ఇదొక చందమామ కానుక!
అజేయుడు గరుడుడు!
21
చిత్రాలు: పాణి
తంత్రవేత్త నాగబంధు పాపాంకరమనే వింత ప్రాణిని సృష్టించి, ఆదిత్యుణ్ణి పట్టి తెమ్మని ఆజ్ఞాపించాడు. అయితే, గరుడభగవానుడి కరుణ ఆదిత్యుడికి కవచంగా ఉండడంతో, పాపాంకరం అయనన్ను సమీపించలేకపోయింది. అది దారుణమైన గాయాలతో ఒళ్ళు హూనం చేసుకుని, దంతాలుకోల్పోయి, గుహాలయం వద్ద కొనప్రాణాలతో వచ్చిపడి, నాగబంధుకు సంగతి చెప్పి అదృశ్యమైపోయింది. అక్కడ ఆదిత్యుడు నాగబంధును నిర్మూలించడానికి రాజు, ప్రజల ఆశీర్వాదం పొంది సర్పదేశానికి ప్రయాణమయ్యాడు.




సర్పదేశాన్ని చేరుకోగానే ఆదిత్యుడి అనుచరులు బసచేయడానికి గుడారాలు నిర్మించుకున్నారు. చుట్టుపక్కల పరిసరాలను పరిశీలించి రమ్మని ఆదిత్యుడు తన అనుచరులను కొందరిని ఆదేశించాడు.
నరేంద్రదేవుడూ, రవీంద్ర దేవుడూ, తమ సైనికులతో ఎక్కడ ఉంటున్నారో చూసిరండి. గుహాలయానికి వెళ్ళే మార్గం కూడా తెలుసుకోవాలి.




స్త్రీ కంఠస్వరం లాగున్నదే! ఎవరై ఉంటారు?
ఆదిత్యుడు గుడారంలో ఉన్నప్పుడు బయట ఏదో ఏడుపుస్వరం వినిపించింది.
గుడారానికి వెలుపల యువ కోయదంపతులు గొలుసులతో బంధించబడి ఉండడం ఆదిత్యుడు చూశాడు.


ఎవరు వాళ్ళు?
సర్పదేశ కోయజాతికి చెందినవాళ్ళు!
అనుమానాస్పద రీతిలో తిరుగుతూంటే వాళ్ళను బంధించి తెచ్చాం.
నిజం చెప్పండి. మీరు నిజం చెప్తారంటే


మిమ్మల్ని క్షేమంగా వదిలిపెడతాం.
మొదట మీరెవరో నాకు చెప్పండి.
అయ్యా! నేను కోయజాతి నాయకుడి కూతురుని. ఈ యువకుణ్ణి పెళ్ళాడదలిచాను.


నాగబంధుకు ఈయన పట్టుబడడానికి ముందే మేముతప్పించుకుని పారిపోవడానికి ప్రయత్నించాము. అంతే. మేము ఏ తప్పూ చేయ లేదు. దయతలచి మమ్మల్ని రక్షించండి.


అయ్యా,
నా పేరు ఆదిత్యుడు. నాగబంధు,
ఆయన శిష్యులు వేరొక ఆదిత్యుణ్ణి
వెతుకుతున్నారు. ఆయన దొరకడం
లేదని వాళ్ళదృష్టి నామీద మళ్ళింది.
మేము ప్రాణభయంతో...


రహస్య బిలద్వారం గుండా
తప్పించుకుని పారిపోయి వచ్చాము.
ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని బిక్కు
బిక్కుమని వెళుతుంటే వీళ్ళు
మమ్మల్ని పట్టుకున్నారు!


నాగబంధు
మనుషులు మిమ్మల్ని
బంధించాలని
చూస్తున్నారా?
ఎందుకు?
బలి ఇవ్వడానికి!
నాగబంధు గురువుకు ఇతడు
అరవయ్యవ బలి అవుతాడు.
మరిన్ని అద్భుత శక్తులు సాధించ
డానికి బలులిస్తున్నాడట!
మా నాన్న చెప్పాడు.


ఆదిత్యుడి చేతిలో గరుడ రేఖ ఉన్నది. మా తెగ వాళ్ళం నాగులను పూజిస్తాం!


మీరేదో రహస్య బిలమార్గం అని చెప్పారు కదా? అది ఎక్కడ ఆరంభమై ఎక్కడ ముగుస్తుంది?
అది గుహాలయంలోని అగ్నికుండం సమీపంలో ఆరంభమై...


... ఆలయ తటాకం వరకు వస్తుంది. అక్కడే మీవాళ్ళు మమ్మల్ని పట్టుకున్నారు.


ఆదిత్యుడంటే మీరేనా! మీ శక్తిసామర్థ్యాల గురించీ, సాహసకృత్యాల గురించీ నరేంద్ర దేవుడి మనుషులు చెప్పగా విన్నాం!
అలాగా! సరే. నాగబంధు వెతుకుతూన్న ఆదిత్యుణ్ణి నేనే. మీరు నన్ను అతడి దగ్గరికి తీసుకువెళ్ళగలరా?
ఇంకావుంది



# వినోద సమయం

## గొర్రెపిల్లను తయారుచేద్దాం

మనం రోజూ ఉపయోగించే కాయగూరలతో మనకిష్టమైన వస్తువులనూ, జంతువులనూ తయారుచేసుకోవడం చాలా ఆసక్తికరమైన కార్యకలాపం. ప్రయత్నించి చూడండి.

**కావలసిన వస్తువులు:** ఒకపళ్లెం నిండా తోటమన్ను; ఆవగింజలు; రెండు తెల్ల ముల్లంగి దుంపలు; కాలీఫ్లవర్; మిరియపు గింజలు; ఐదు దృఢమైన పుల్లలు; చిన్న కత్తి; జిగురు.








గొర్రెపిల్లను తయారుచేయడానికి నాలుగు రోజులు ముందు, ఆవగింజలను మన్నులో చల్లి, రోజూ నీళ్ళు చిలకరిస్తూ రావాలి. మూడు నాలుగు రోజులలో అవి బాగా మొలిచి గొర్రె పిల్లకు కావలసిన పచ్చికమైదానంలా తయారవుతుంది. పెద్ద కాలీఫ్లవర్ ముక్క పచ్చికమైదానంలో చెట్టులా పనికివస్తుంది.

**గొర్రెపిల్లను తయారుచేయడం:** ముల్లంగి మొనదేలిన భాగాన్ని కత్తిరించుకోవాలి. దాంతోనే గొర్రె తలభాగం తయారుచేయాలి. తల వెలుపలివైపు చిన్నగాడిలా కత్తిరించుకోవాలి. అది నోరులా కనిపిస్తుంది. మిరియపు గింజలను కళ్ళభాగాలలో అతికించుకోవాలి. గొర్రెపిల్ల శరీరభాగాన్ని ముల్లంగి దుంప మధ్యభాగంతో తయారుచేసుకోవాలి. దాని కాళ్ళకూ, మెడకూ, సమానమైన కొలతలు గల దృఢమైన ఐదు పుల్లలను ఉపయోగించాలి.

గొర్రెపిల్ల శరీరభాగం మీద గుండ్రంగా, పలుచగా కత్తిరించిన ముల్లంగి ముక్కలను అతికించాలి. అవే దాని శరీరం మీది గుబురు రోమాలు. చెవుల భాగాల్లో కొన్ని ముల్లంగి ముక్కలను అతికించాలి. బొమ్మపూర్తయ్యాక దానిని అలాగే తీసి ఆవమొలకల పచ్చిక మైదానంలో నిలబెట్టాలి.

# తేడాలు కనుగొనండి

చూడడానికి రెండు చిత్రాలూ ఒకేవిధంగా కనిపించినప్పటికీ, రెండింటి మధ్య ఎనిమిది తేడాలు ఉన్నాయి. కనుగొనండి చూద్దాం.







# పాపం రోహిత్‌కు సాయపడండి

పాపం కుందేలుపిల్ల రోహిత్‌కు ఒంట్లో బావోలేదు. అది వేసుకోవలసిన మాత్రలు, క్యాప్సూల్స్ గదంతా చిందర వందరగా పడి ఉన్నాయి. మనం సాయం చేయాలి కదా? మాత్రలనూ, క్యాప్సూల్స్‌నూ జాగ్రత్తగా తీసి, ఎన్ని ఉన్నాయో లెక్కపెట్టి దాని చేతికివ్వండి.

(సమాధానాలు 66వ పేజీ)




# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జనవరి 2003సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.

## అభినందనలు

సెప్టెంబర్ 2002 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
శ్రీమతి యస్. గ్రేస్ వేదమణి
3/2153, రాజారెడ్డి వీధి
కడప - 516 001 (ఆం.ప్ర).

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటిఫోటో: కుసుమ కోమల బాల్యం!
రెండవఫోటో: కోల్పోతున్న వైనం!!

| వినోద సమయం సమాధానాలు (పేజీ 65) | తేడాలు కనుగొనండి! | | రోహిత్‌కు సాయం |
|---|---|---|---|
| | 1. టోపీ చివరి బంతి | 5. మేక గడ్డం | 38 మాత్రలూ, క్యాప్సూల్స్. |
| | 2. టోపీ మీది డిజైన్ | 6. ధూళి మబ్బులు | |
| | 3. కొమ్ముల మీది గీతలు | 7. కుర్రవాడి జేబు | |
| | 4. మేక నాలుగో కాలు | 8. షూ డిజైన్ | |

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

